# ఆర్యులారా,

మ॥ పసలేదించుకయైన నేచదువులన్ పైపూతలే కానినా
కు సదా కబ్బము వ్రాయు నేరుపిటులన్ గోరాడ శ్రీరామచం
ద్ర సుధీచంద్రుని శిష్యుఁడన్ గనుకఁ జెందంగల్గెఁబో యింగు విం
పెనఁగంగట్టిన గుడ్డరిత్త దగునా యేనింతకున్ ధన్యుఁడన్।

క। గోరాడాన్వయ చంద్రుని
ధారాళ మహాకవిత్వ ధారాకుశలున్
ధీరుని మద్విద్యాగురు
సారజ్ఞుని రామచంద్రశాస్త్రిని దలతున్॥

వారణాశి రామమూర్తి.



శ్రీరస్తు—శుభమస్తు.

# శ్రీకృష్ణకీర్తనశతకము.



కం॥ శ్రీవేణుగానలోలా। నీవేనాదైవమంచు నెరనమ్మియునే
భావజజనకా నీపద। సేవనుగను నిష్టబూని చేయుదు కృష్ణా॥

శా॥ నానాకష్టములం గృశించితిని నే నాభాగ్యమెట్లున్నదో
యో నాకాధిపవంద్యపాదకమలా యో కృష్ణదేవాహరీ।
నేనీవాడను నాదుకోర్కెలియవే నీవేగదా నాకు ది
క్కో నందాత్మజ వేడెదన్సతత మే నో నాథ రక్షింపవే॥

శా॥ దేవా నేగనుజిక్కులంబడుటచే దిక్కేగు నీకంటెన
న్నావంజాలెడువారు లేరనుచు నీకారుణ్యమే కోరి నీ
సేవం జేయుచు గాలముం గడుపుదుం శ్రీకృష్ణ కాపాడవే
నీవాడన్నిగమాంతవేద్య యభవా నిర్భాగ్యుడం దీనుడన్॥

శా॥ సంసారార్ణవమగ్నుడన్ ఋణములన్ సంకోచితాత్ముండ ద
ద్ధింసాటోపము దుర్భరంబగుటచే నిక్కట్లపాలైతినో
కంసారీ నినునమ్మి వేడెద గదే కాపాడ నే దైత్యవి
ధ్వంసా నీపదసేవ నేనిరతసద్భక్తిన్ దగన్ జేయుదున్।

శా॥ ఆయుర్దాయము నాకుగ్గుప్తముగదా యంభోజగర్భార్చితా
నాయందుం దయరాదుగా గిరిధరా నాబిడ్డలే మాదురో
మాయామానుషవిగ్రహా గుణమణీ మన్నించి నాతప్పులన్
వేయేలా కడతేరుసాధనము నీవే చూపి నన్గావవే।

శా॥ పాపాత్ముండను బాపకర్ముడను నేబాధోధిశాయీహరీ
నీపాదాబ్జమె నమ్మినే సతతముల్ నిన్నేభజింతుంగదా
నాపాపంబది యేమొకో యెరుగనే నాపై దయంజూపవే
రావేలా నను వేగబ్రోవగదవే రాజీవపత్రేక్షణా॥

శా॥ గోపాలాంగన లెంతపుణ్యలో గదా గోపాలచూడామణీ
నీపై ప్రేమనుజూపుమాత్రమున నే నిర్వాణమబ్బెంగదా
నీపుత్రేతగ దారకంబనుచు నేనిన్నే సదా గొల్వగా
నాపద్బాంధవ నన్ను బ్రోవ నిసుమంతైనన్ మదిన్ దల్పవే॥

శా॥ ఎంతెంతో సరసత్వముండినను దా నెంతో బలాఢ్యుండుగా
నెంతైనన్ననుపించి నవ్వనికి రాదేమైన గానిమ్ము గా
నెంతైనన్ప్రియలేదు నిశ్చయముగా సాక్షాత్ పరబ్రహ్మమా
కొంతేయావననీదు భక్తజన సంస్కారంబు లేకుండినన్॥

కం॥ అనియిటు బరిపరివిధముల। ననుకొనుచుండగను నాదుననుగన్ సతి
యున్। దనయులు మొదలగు వారలు। విని యందుల నిద్దరగిరి వేడుక మీరన్

చం॥ సనకసనందనాదిముని సన్నుత దివ్యచరిత్ర కృష్ణ కీ
ర్తనశతకంబు మేము సతతంబు పఠింప రచించి యుండ టం
చనుచును బెద్దకూతురన నట్టులె తల్లియు గోరవల్లెయం
చనికృతకృత్య తంబడ యునా శతకంబును జేసి తిందగన్॥

కం అందులకృతిపతి యెవరను। సందియమిసుమంత లేక సరభసగతినా
డెందము మజ్జీవనపతి। యం దేనెలకొని యెమిగుల నాహ్లాదముతోన్॥

శా॥ శ్రీరంజిల్లమహోపకారమతిచే జెన్నొందు నేధన్యుడో
యా రాజామల రాజు వేంకటనృసింహారాయ భూపుండెనన్
దా రక్షించెను గాననీశతకముల్ సంతుష్టచిత్తుండనై
యా రాజన్యున కంకితంబెలమి నే నానందినై యిచ్చితిన్॥

చం॥ ధనగరిమన్ గుబేరుడు వదాన్యతగర్ణుడు బాహుదర్పమం
దనిలసుతుండు శత్రుబల హార్యధనంజయు డాత్మశుద్ధి నా

దినకర వంశపావనుడు గనదయాపరి భాసియుంచు నీ
జనవరు బెక్కుభంగులను జాల్వొగఁబుట్టదు రందరుఁ భువిన్॥

సీ॥ వీరిపత్నీరత్న మేరేడియడిగిన జాల్పుమీఱఁగనిచ్చుసరసమతిని
కనకాదివస్తువాహనములుగోరిన బలుమారులిచ్చునుభద్రవృత్తి
భూషణాంబరములు బుధజనంబులుగోర జిత్తశుద్ధిగనిచ్చుశీఘ్రముగను
భూదానగోదానపుణ్యదానములన్ని నింపు శ్రేయముడి నిచ్చుచుండు నెపుడు
నప్పరాయాన్వయపయోబ్ధి నవతరించె నార్జవపథానువర్తి మహాగుణాఢ్య
శ్రీమహాలక్ష్మి ధర్మప్రసిద్ధకీర్తి। యార్తజనరక్షణంబున నమితరక్తి॥

కం॥ సాక్షాల్లక్ష్మివలెన్మరి। పక్షీంద్రతురంగువలెను భార్యాభర్తల్
రక్షింతురాశ్రితావళి। నక్షీణదయాప్రశోభితాత్ములువీరల్॥

ఉ॥ వీరికొమార్తెలిర్వురును। విశ్రుతకీర్తి విరాజమానలున్
నీరజవైరిభాఃఛటల। నిర్మలహాస విభాసితాస్యలున్
క్షీరసముద్రపుత్రికయు। నీరరుహోద్భవురాణివాణియున్
ధారుణిబుట్టువుల్గనిరొ నాఁజెలువారుచు నుండురెంతయున్॥

ఉ॥ శ్రీరమణీయవాక్స్ఫురద శేషచమత్కృతి భాసమానుఁడున్
మారసమానరూపుఁడు కుమారుఁడు కొండలరాట్ప్రభుండుబల్
కీర్తిమీఱ నర్థులకు "లేద"నకిచ్చు నభీప్సితార్థముల్
వారకనెల్లవారలు "భళారె"యటంచు గడున్నతింపగన్।

గీ॥ హరిపై బద్యములుకొన్ని విమలమతిని వ్రాసియొసగితి సముఖాన రాణమిగుల
గ్రాలముద్రాపితములు గాగ జేయ। బూనినాడను వేడ్కగ వానినెల్ల॥

గీ॥ విజయనగరేశుమాడ్కి నివిమలకీర్తి। శ్రితజనాళినిబోషించుచిత్తవృత్తి
దేజరిల్లెడు నీమహాతేజుభూపు। నిష్టసిద్ధుని జేయు సర్వేశకృష్ణ॥

జంఝూటి — ఆదితాళము.

1 (నలుగిడరాపెబాల అలుగకేమంచికీల) అనేమట్టు.

గోపాలబాలకృష్ణ । రాకేలబోప్రియమయ్యా ।గో॥

నాపాలిదైవమీవె । నీపాప్రిపెగోరితిని ।గో॥

ఆనందముద్దుపట్టి । యాశ్రితకల్పవల్లి । నీనామకీర్తనంబు । నిరతంబు సేయుచుందు ।గో॥

యశోదచిన్నితనయ । యశేషభూతాధార । విశుద్ధాత్మునన్ను జేయ । వేవేగగరుణింపవే ।గో॥

పతితపావననామ । పావను జేయనన్ను । శ్రితహితమతివై చేపట్టి రక్షింపవే ।గో॥

శరణన్నవారినెల్ల । గరుణించిప్రోచితివి । కరుణాసముద్రుడవు కరుణింపవేలనన్ను ।గో॥

సేతురామదాసుడను । జాతాబ్ధిమగ్నుడను । వీతరాగుజేసినన్ను పిలసిల్లజేయరాద ।గో॥

హిందుస్థానితోడి–మిశ్రగతి–అటతాళం

(తల్లి గోదాదేవి గైకొని తనరుమంగళహారతి)అనేమట్టు

గోపాలకృష్ణ నాదుజన్మము । పావనంబెటులగునోనీ । పాలబడితిని నీకృపముంచుము । పాలముంచుము దేవరా ।గో॥

ఎన్నిజన్మములెత్తితినోయిం । కెన్నిజన్మములున్నవో । చిన్నికృష్ణా నన్నునీకడ। జేర్చనీదయరాదుగ ।గో॥

నీదునామస్మరణమెప్పుడు । నేమమేర్పడజేతునీ। పాదసేవానిరతియే నా । భాగ్యమనితగజేతుగా ।గో॥

పక్షివాహనయీశ్వరప్రీతి । కక్షనాపైలేదుగ రక్షణముకావలె నుజుమ్మిరక్షమాం । శరణాగతాం ।గో

సేతురామదాసుడనునను। జేరజీరవదేమయా । రాతిరిపగలనకసతతము । ప్రీతిచేనినువేడితి ।గో॥

3 తోడి—రూపకతాళము.

(భళిశ్రీ సుదర్శనదాస శిష్యుడు) అనేమట్టు.

ఔరయేమని వినుతింతును । ఆ శ్రీకృష్ణభగవానుని చరితము॥ ఔ॥

క్రూరకౌరవాంబుజములు। ఘోరయుద్ధరంగమందు। ఘోరార్జునకరి నేలంగూలునట్లు బరిమార్పగ । జాలునట్లు రథమునడిపె॥ ఔ॥

నిరతహీన దశనున్న నిర్భాగ్యుడు చేయునెన్న। ధరప్రసిద్ధసంపన్నుగ। సరసమతిని సల్పెనుగద । సురపతి యచ్చెరువొందగ॥ ఔ॥

మన్నుదినగదన్నుదల్లి। మందలింపనోటజూపె । మన్నులేదనికుక్షిని బ్రహ్మాండపిండ మండలంబు । గంమమీర గుంగెలవియ॥ ఔ॥

సేతురామదాసునన్నా । శ్రీకృష్ణస్వామి వి। ఖ్యాతిమీరగావ వేడెద పీతభయాజాతశత్రుని। ఖ్యాతికరహితాత్ము జేసి॥ ఔ॥

4 పూర్ణచంద్రిక—ఆదితాళము.

(వాకిలిదియ్యవె వారిజలోచన) అనేమట్టు.

గోపాలకృష్ణ నాపాలిదేవ నీ। పాపిరికోరతి బాపవిదూర॥ గో॥

భూరిదయానిధే వారిరుహాక్షుని। భువనరక్షక భుజగశయన । వారిజాసనవందిత పాదాబ్జనా । కోరినకోర్కెలు కొనసాగజేయావే॥ గో॥

సామజవరద నా పామరత్వము చే । జాలా యిడుములపాలైతిగదె । నామొరాలకించి నమ్ముబ్రోవవేమిర । నందకుమారక నవనీతచోరా॥ గో॥

సుందరాకార గోవిందజనార్దన । మందరగిరిధర మాంపాహి । బృందారక బృందవందితచరణ నా। యందేలనో నీకెందముకురాదే॥ గో॥

సుదర్శనధరగోప । సుదతీమనోహర। యదయుతనిటునన్నాదరింపవేర సదయుడవైనను సంరక్షింపుము । సదమలమునిగణసన్నుతతేజ ॥ గో॥

సేతురామదాసుడ । శ్రీచిన్నికృష్ణ। చిరకాలము సీశరణమువేడుచు। నాతతభక్తిని। న్ననవరతము నేనాశ్రయించితిని సిరర్ధకమాయెను॥ గో॥

5. ధీరశంకరాభరణము—మిశ్రగతి.

(గిరిజాకవాటము తీయుము) అనేమట్టు.

స్వామి నాపైదయరాదుగ । నేనేమి నేరము జేసినానొగ॥ స్వా॥

పతితపావన బిరుదుండియు । నన్ను బావనుజేయ గల్గియుండియు । నతివిముఖమతి నుందువేమయ , నాకికగతిపయ దినములెజున్మి । కాలముకృష్ణ॥ స్వా॥

ఎంతనినేవిన్నవింతును । నాపైసుంతైన దయరాదేమందును। గంతు జనకనాతోబంతమ । యెంతోవింతదోచును నీయుదంతముకృష్ణ॥ స్వా॥

ఘోరసంసారాంధకారము । నీకారుణ్యాబ్జమిత్రతేజము । పారదోలునుగానర్దైనమా । నీదుపదభక్తింగాలము గడుపుదుకృష్ణ॥ స్వా॥

సేతురామనామదాసుడ భవ । త్సేవాదురంధరనిరతుడ । బ్రీతిమీరగనీదుభజనము । నేజేతుసతతము రక్షింపవేకృష్ణ॥ స్వా॥

## 6. కేదార — ఆదితాళము.

(వారిజలోచన మాశిరో) అనేమట్టు.

రక్షితభక్తజనబృంద । రక్షాందేహీముకుంద॥ ర॥

అక్షీణకరుణానిధి నా। రక్షణమునీదేగదయ్యా । రక్షితనిజజన శిక్షిత దుర్జన । పక్షివాహ ప్రతిపక్షవిదారణ । రక్షితామరేంద్రాదిసురగణ। కుక్షిస్థిత బ్రహ్మాండపాలక॥ ర॥

పరమార్థచింతనము నేను , నిరతము జేయంగాగల్గ । స్థిరమతియుతుగాగరుణంజేయవె । పరమపురుష నీచరణధ్యానము । పరమానందమె సంగజేయుదును ।మురారినారదాది మునివంద్య॥ ర॥

విజయుతపాండవసింహ । యజయుత కౌరవద్విప । నిజముగ పాండవ విజయమునీదయె । నజగరశాయినీ భజనము జేతు నీ । భజనపరాధము గాన్గైకొనవె। సుజనపోషక సుముఖివిగావె॥ ర॥

సేతురామనామదాసుడ । శ్రీవేణుగోపాల కృష్ణ । భూతలమునందున నాతాపత్రియ । రీతినేరపఖ్యాతింజెందను । ఖ్యాతిమీర నన్గాపాడగదే వీతిహోత్ర సీతకిరణాదినుత॥ ర॥

## 7. కేదార — మిశ్రగతి

(ఎంతచక్కనివియ్యాలవారు) అనేమట్టు

సకలభూతాంతరాత్మనీవె । సర్వశక్తిసంపన్నుడనీవె । స ।

శుకయోగిప్రకటితచరిత । శూరదానవహననా శ్రీకృష్ణ ॥స॥

కుక్షినిర్భేదద్రాపదీయ । రక్షణార్థాలాపములకు । నక్షయంపువలువలొసగి । రక్షించితివి వె శ్రీకృష్ణ ॥స॥

పరమపురుషనీపాదసేవ । కరమునిష్ఠాగరిష్ఠుడనై నిరతము సేయంగగల । స్థిరమతినీయగదె శ్రీకృష్ణ ॥స॥

నన్ను సేతురామదాసుడ । మున్ను జేసిన పాపములరీత్య । చిన్నచూపు చూడకుమని । యన్నితుమియించిప్రోవు శ్రీకృష్ణ ॥స॥

8 సురట — చతుశ్రగతి — ఏకతాళము

(ఆయశోదభాగ్యమే భాగ్యము) అనేమట్టు

నీపాదసేవయె శ్రేయము । నీ॥

పాపాత్ముడనునను బావనుజేయగనే ప్రాపులేదుగదే శ్రీకృష్ణ ॥నీ॥

యదుకులతిలకయమశిక్షదప్పగ । నేదియుగాపుగదే శ్రీకృష్ణ ॥నీ॥

ఆపన్నివారణమున । కాస్పదంబుగ । నేప్రాపులేదుగదే శ్రీకృష్ణ ॥నీ॥

సేతురామదాసునా । చిత్తశుద్ధిగాగ । నేతెరవువెరవే శ్రీకృష్ణ ॥నీ॥

కల్యాణి — ఆదితాళము

(నీకరుణగననేరనిపాపిని) అనేమట్టు

నీపదకమలసేవయె కార్యము । పరమపావనము భవభయనాశకము ॥నీ॥

సదయుడ సురరిపుమదహర । శ్రీకృష్ణసదాభజన పరప్రాపుదానందదాయివి । నీ ।

దేవసదమలస్వభావ । నిష్కల్మషప్రభావ । పరమానందభావ । కలుషమార్గాభావ । సదామహానుభావా నీవాడరనీవెగద నాకుంగతి కావగదె యోదేవ రక్షాందేహి ॥ నీ ।

స్వామినామొరవినవేమి, నావల్లనేరమేమి పరుషభావమేమి । సరసము లేదేమి । విరసభావమేమి దయానిధే । యేమని నేవేడుదు ప్రేమెగన రాదాయెగా పాడవె । నీ ।

నాథా పరిపోషితానాథ । రక్షితసురనాథ । శిక్షితాసుర నాథ । శోషితభక్తవేధ । సర్వోత్కృష్ట శ్రీనాథ । సురార్చితసేతురామదాసుడ భూతదయోక్తోరితి గాపాడవె ॥ నీ॥

10 హిందుస్థానితోడి — రూపకతాళం.

బారో బావురుతాణిగె రుక్మిణి ప్రాణవల్లభ హరిగె (అనేమట్టు.)

స్వామి నీ నేగాదైవము భూమి భారము దీరెగనిజము॥ స్వా॥

దుర్మార్గులగు రాజుల దుష్టాకములగు నసురుల నిర్మూలుర జేసి నిత్య ధర్మజయముజూపితి కృష్ణ॥ స్వా॥

గోపికాంగనామణుల గోరికూడినట్టుగా । బాపరిహితులంజేసి పరమపదం బిచ్చితి కృష్ణ॥ స్వా॥

వైరియయ్యు శిశుపాలుడ హరోరాత్రులు నీధ్యానము నిరతదీక్ష జేసిన కతన నిన్ను జేర్చుకుంటి శ్రీకృష్ణ॥ స్వా॥

సేతురామదాసుడనే। శ్రితరక్షణబిరుదనీదె। చేతులెత్తి మ్రొక్కెద రక్షింపబూనవే శ్రీకృష్ణ॥ స్వా॥

11. సావేరి — ఏకతాళము — చతుశ్రగతి.

బారయ్యా వెంకటరమణ యేభక్తరాసిధ (అనేమట్టు)

రావయ్యా గోపాలకృష్ణ రక్షింపుమయ్యా దేవ॥ రా॥

నీవేనాదైవమని, నెరనమ్మి యున్నానయ్యా॥ రా॥

అన్యదైవమునే నాశ్రయింపగలేదు। కన్నడచేసినన్ను, జిన్నబుచ్చకుమయ్యా॥ రా॥

పరమదయాళుడవయ్యా। బరుషభావ మేలనయ్యా। కరమను రక్తిని నీచరణసేవజేయుదు॥ రా॥

భజనపరనూలధనమ। రజనికరబింబానన। నిజభక్త సందోహ నిర్మలానందభావ॥ రా॥

శ్రితరక్షణాంతరంగ। సేతురామదాసునన్ను। హతకలుషు జేయగాను। హితమతిబూని వేగ॥ రా॥

12. మేచకల్యాణి — ఆదితాళం.

(మంగళంజయమంగళం మంగళం) అనేమట్టు.

రక్షరక్షమహాత్మ హేకృష్ణ। శరణాగతాంమాం॥ ర॥

శిక్షితదుర్జనసంఘ । రక్షితసద్బృంద । పక్షిరాడ్వాహనా । పాపములెడ జేయగదవె॥ ర॥

నీదు పదభజనము నే ! నిరతదీక్ష జేయుదు । వాద మేలనయ్య నన్ను । వదలక నిను జేర్చుమయ్య॥ ర॥

పరమపావన । పతితపావన । బిరుదులు నీ వేగదపరమపురుష పద్మనాభ పాతకుడ నా పాలిదైవము॥ ర॥

సేతురామదాసుడనునీ। సేవ నెప్పుడు జేయుదు । బూతనప్రాణాపహారిపూతాత్మగనన్ను జేయవే॥ రక్షి॥

13. బేహాగ్—ఆదితాళము.

(తారో తారో నిన్నచరణవా) అనేమట్టు.

నన్ను బ్రోవ నీకు భారమ। న॥

చిన్నికృష్ణ సన్నుతాంగ। న॥

అరుణోదయాత్పూర్వ । మనుదినము నీ నామస్మరణమె జేయుదును సరసమతిని వినవా॥ న ।

మాపురేపనక। మాధవనీదు సేవె ప్రాపని జేతువిననోపవె దేవ॥ న॥

వనరుహ నేత్రని । న్ననవరతము వేడ। వినివిననట్లుందు। వనువగున॥ న॥

సేతురామదాసున్నాపై । సీతకన్నేలనయ్య । పాతకరహితు జేయ । బ్రాపునీవెకృష్ణ॥ న॥

14. నవరోజ్—ఆదితాళము.

(రామరామ రఘురామ పరాత్పర)

శ్రీనివాస శ్రితదుష్కృతనాశక , చిన్మయరూప శ్రీకృష్ణ । యనాధరక్షక యార్త జనావన । యమోఘచరితబ్రోవవే॥ శ్రీ॥

రాధామనోహర రమ్యగుణాకర। రాక్షసాంతక రావయ్య। సుధాంధ సంస్తుత। సుగుణాన్వితనా । వ్యథలన్ దీర్చినన్ గావవె॥ శ్రీ॥

గానలోల కరుణాలవాలయో । కనకాంబరధర గోవింద । సనకాది సన్నుత సాంబార్చితపద । సరసీరుహరక్షింపవే॥ శ్రీ॥

సేతురామదాసుడ । చిత్తశుద్ధికై చింతిలుచుంటిగదయ్య । యాతత భక్తినేనాలాపించెద । నాదరించి కరుణింపగదే॥ శ్రీ॥

15. ఆభోగిరాగం — ఆదితాళం — మిశ్రగతి.

(అక్కర లేదు ఓయన్నపాలివ్వన) అనేమట్టు.

**నందకుమార సుందరగోప బాల॥ నం॥**

వందనమిచ్చెనీకు । నందితసురబృంద॥ నం ॥

ఖండితరిపులోక । దండితదైత్యానీక । మండితశ్మశ్రుశ్యాలక । మండితార్కకదంబక॥ నం॥

పాలితత్రిభువన । పంకేరుహ నయన । నీలకంఠార్చిత । నీరజోపమపాద ॥ నం ॥

క్షీరసాగరశయన । సేతురామావన । కోరినకోర్కె లీవె । కోమలి సత్యప్రియ॥ నం॥

16. అఠాణ – ఆదితాళం.

(నీమనసు కరుగదేమి సేతురా) అనేమట్టు.

ఓపరమపురుష మహానుభావయోంకారరూప॥ ఓ॥

ప్రాపునీవెనాకని మొరలిడ । నాపద్బాంధవ యాపదదీర్పవు। ఓ।

సాదరాత్మననుబ్రోవగవేంతి । యాదవాబ్ధిచంద్రకృష్ణ । నీదుపాద సేవజేయుచుంటిని। నిర్మలాత్మ నీరజనాథ॥ ఓ।

సంతతంబు నీవేదిక్కని మ్రొక్కిన। సుంతయైన దయరాదెదేవ । పంతమేల నాపైనీకో । కంతుజనక కంసనృశంస। ఓ॥

సేతురామ దాసుండనునేనీ । చేతంజిక్కితి భూతదయాళో । సీతదృష్టిజూచిబ్రోవుముకి । శ్రీనాథ క్షీరార్ణవశయన। ఓ॥

17. నాటకరంజి — రూపకతాళము.

(సతత పతితపావనా) అనేమట్టు

బాలగోపబాలనా । పాలిదైవమామురారి॥ బా॥

వాలాయమునీలీలల। నోలిబాడ నాలింపవు। హేలగానుగోపసతుల జాలగూడికేళిసల్ప । స్త్రీలోలుడవనబడిన చిద్విలాసమూర్తివిగద। బా।

భక్తబృందవార్ధిచంద్ర। పక్షిరాడురంగమాయను। రక్తిమీరగొల్తునిను। రజనికరబింబానన। శక్తికొలది సేవించెద । శరణంబని నీపాదము

ముక్తిదాతనీవెగద। భక్తపరాయత్తచిత్త। బా॥

సుందరాంగనిన్నందరు। నందుగలడిందు లేడని। యెందరెన్నోరీతు లముచుకుంద నిన్నందరంద్రు। నుందమతి పలుకులవి। మన్నింపగరాదు జుమ్మి। సందియమాగోవింద, సర్వాంతర్యామివీవె। బా॥

సేతురామదాసుడనర। జేరజీరనొల్లవేమి। చెంతజేర్చిబ్రోవగదె। కంతుజనకకమలనాథ। యింతదోచు నీయుపేక్ష। పంతమసీకు నాతోడ నా। సుంతయైన దయరాదె। యెంతవేడినశ్రీకృష్ణ। బాల॥

18. కల్యాణి—జులావ తాళం.

(ఈశ్వరసంకల్ప మెవ్వరెరుంగుదురు) అనేమట్టు.

గోవర్ధనోద్ధర గోపీమనోహర। గోపాలచూడామణీ॥ గో॥

నీవంటిదైవంబు నేనెందు గానను। నీవెదిక్కనినాను నీపాదయుగళం బు భావజ జనకకను। భక్తి సేవింతును॥ గో॥

ఘడియఘడియకు। గడునాసనునే। బడలికనొందక। బాడబవంద్య। యెడతెగకుండగ। నెంతప్రార్థించిన। యెడమియవేమయ। యేమిసేతు కృష్ణ॥ గో॥

సామజవరద। సద్గుణగణధామ। నేను మేర్పడగ। నిన్నుభజియించితి। బామగుండె నా। పాపకర్మఫలమేమొ। కామితార్థమీయవు। కఠిన మిదేమయ॥ గో॥

సేతురాముడ నీ। సేవానిరతుడ। నా తెరగెరిగియునర రక్షింపవే చేతులెత్తి వేడ। జిత్తమీవుగదె। భూతదయాళో। పుణ్యపురుష శ్రీశ॥ గో॥

19. మలయమారుతం—ఏకతాళము.

(అభయమివ్వరా) అనేమట్టు.

చిన్నికృష్ణదేవ। చిన్మయస్వరూప। చి॥

పన్నగశాయియో। పక్షిరాడ్వాహన। నన్నుగన్నతండ్రి। నామీద దయరాద॥ చి॥

దేవకీనందన। దివ్యకళాన్విత। భావజజనక పాదసేవకుండ। బావ నుజేయవె పాపాత్మునన్ను। చి॥

కందర్పశతకోటి సుందరాకారమె। నందుముద్దుపట్టి। నవనీతదధిచోర। మందభాగ్యుడను। మాధవబ్రోవవే॥ చి॥

కనకాంబరధర కౌస్తుభాభరణ । సనకాదిమునిసన్నుత చరితనిన్నే నమ్మితిని నీరజనయన॥ చి॥

శ్రితరక్షణచిత్త సేతురామదాసు । సతతమునిన్నే చాలభజించు। హితమతిబూని। యేలుమొపరంధామ॥ చిన్ని॥

గానమూర్తి—ఆదితాళము.

శ్రితజనకల్పభూజ। శ్రీకృష్ణ శ్రీరుక్మిణీశ శ్రీ॥

సతతభవదంఘ్రిసేవా। రతియుత సేతురామా। శ్రితరక్షణాంచిత। చిత్తముజూపగదవే॥ శ్రి॥

కమలజాజ్ఞంధరః శ్రీ। కమలాక్షుకడకేగి। యమరాదులందరుదన్నా క్రమించినభా। రముదీర్పమనివేడ। రక్షింపబుట్టితివి యో కమలనాభ నీవె యా। కనులాక్షుడవుగావె॥ శ్రి॥

శరణాగతత్రాణ బిరుదుగల్గి యుసీ। శరణుశరణనినే। నిరతము సేవింప। గరమనురక్తినిన। న్నావబూనకయో పరమాత్మ, పరమింతుపు నాపాపకర్మఫలము॥ శ్రీ॥

భజనపరాధముడ నాపాపములుతీమియించి। యజగరశాయి న। న్నాదరింపగదవే। నిజముజెప్పెద వినుము నీదయ లేనిది। త్రిజగన్నుత నాకు దిక్కెవరెదీనుడను॥ శ్రీ॥

21. మాంచి-రూపకతాళము.

(తియవేకవాటు) అనేమట్టు,

గోపాలకృష్ణ నా। ప్రాపునీవనినమ్మితి॥ గో॥

రేపుమాపనక నేను నీపాదభజన జేతు। నాపాలిదైవమనన్నాపాడక దలవవుగదే॥ గో॥

నిరతమునీకీర్తనంబు కరమనురక్తిం బాడుదు। గరుడగమననాపైకించిత్కరుణజూపవుగదే దేవ॥ గో॥

ఎంతవిన్నవించినగాని । సుంతైనయాలింపవు । పంతమేలనాపై నీకు । బద్మనాభ పరమపురుష॥ గో॥

శ్రీకార్నవశయన నీ । సేతురామదాసుడ న॥ స్మరితినిగాపాడనో నా కీవేగదదిక్కు-కృష్ణ॥ గోపాల॥

22 కాంభోజి — ఆటతాళము.

(మాధవందగ్నయ) అనేమట్టు.

నీవాడగా బ్రోవవే । యోకృష్ణ॥ నీ॥

నీవాడననుచును । నిరతము మొరలిడుద । నావనొల్లపుగద । కామ జనక ॥ నీవా॥

మాధవగోవింద। మధుసూదనహరి। మాంపాహిమాంపాహి। సాధు జనావన । సద్గుణమణిగణ , బాధితాసురనీ। పాదసేవకుడ॥ నీ॥

వాలాయమునిన్ను వదలక సేవించు । వాడననుదయజూడవు। యేలీల మ్రొక్కినవెంతవేడుకొనిన నెంతకఠినుడ విసుమంతైన దయరాదు ॥ నీ॥

ఓమహాత్మసేతు । రామదాసుడనే । నోంకారప్రియశ్రీధర , నీమహా త్మ్యమెన్న నేనెంతవాడను నిగమగోచర నాకీవెగదాదిక్కు ॥ నీ॥

23 యమునాకళ్యాణి-ఆదితాళము.

(వదలనేరనయ్య శ్రీహరిని) అనేమట్టు.

శ్రీశా గోపాలబాలకృష్ణ చిదచిద్విలాస॥ శ్రీ॥

ఆశాపాశ వినాశేచ్ఛంజగ । దీశనీనామంబే స్మరియించెద॥ శ్రీ॥

నత్తి కిరీటమత్తరిని । నేలంబడదన్న । సత్యభామంబ్రీతిజూచి । నిత్య భజనచే నీపదములునా । నెత్తి మోసినను నెనరునజూడవు॥ శ్రీ॥

మాటిమాటికి నిన్నునాదు । మదినిదలంచి దీర్ఘధ్యాన నిష్ఠంబూని పటిదప్పకను భజనజేసిన । స్నేటిచిత్రమీ యేమియుబల్కవు॥ శ్రీ॥

భక్తబాంధవుడను నీపేరు । భంగముగాదె భక్తునన్నువిడనాడ । ముక్తిభాగ్యమీవె మురహరకడునను। రక్తివేడు సేతురామదాసుడను॥ శ్రీ॥

24 పూర్ణచంద్రిక-ఏకతాళం-చతురశ్రగతి.

(పరముజూడ వేవేగ) అనేమట్టు.

గోపాలబాలకృష్ణగోవర్ధనోద్ధర।ఆపదోద్ధారక నాపాలిదైవమీవే॥గో॥

భవభయనాశక బ్రహ్మాదిసురవంద్య। నవనీత దధిచోర నాపాలిపు నీవెనుమ్మి॥ గో॥

తాపసశరణ్య కాపురుష విధ్వంస। కాపాడనీవెదిక్కు కంజదళాక్ష నన్ను॥ గో॥

శ్రితరక్షణైకదీక్షం జెన్నొందు దేవానీవా। శ్రితుసేతురామునన్ను కేపట్టి రక్షింపవే॥ గోపాల॥

25 నాటకురంజి.—రూపకతాళం.

(మంగళం మృగాంక శేఖరునకు) అనేమట్టు.

వందనం భవత్పదారవిందములకు। కృష్ణ యిందీవర శ్యామ వర్ణసుందర మహనీయగాత్రి॥ వం॥

సుందరగోపీ సతీమనోహర దేవ, నందనందనగోవింద। నారదాది మునివంద్య, డెందములర నీనామము। పొందుగభజియింతు సంక్రందననుత దివ్యతేజ। కావవెవన్నలుపాత్ముడ॥ వం॥

శరణాగతరక్షణ బిరుదునీదె కృష్ణ। పరమపావననామ యోపరంధామ। పరమపురుష। నిరతివ్రతదీక్షను నే। నీసేవాకైంకర్యం। బరమర లేకను జేయుదు। నాస్త్రావనబ్రోవగదే। వం॥

ఇందిరాలంకృత భవ్యవక్షస్థల స్వామి। మందభాగ్యసేతు రామునందుదయరాదె భక్త। బృందములో వాడెగద। యెందువలన రక్షింపవో సందియంబులేదు నీ। సంరక్షణమే నమ్మెను॥ వం॥

26. దేవమనోహరి — ఖండగతి — ఏకతాళము.

(సొగసుజూడతరమా) అనేమట్టు.

భజనపరుడనేను నీభజనపరుడనేను। త్రిజగన్నుత శ్రీకృష్ణ॥ భ॥

అజముఖసురబృంద సేవిత। భుజగభూషణ పూజితపద॥ భ॥

సామగానలోల సుత్రామసన్నుతలీల। నీమహాత్మ్యమెన్న నేరు నేరు తురేపరంధామ॥ భ॥

జాలమేలబ్రోవం గరుణాలవాలదేవ। నీపాలబడితి గోపీలోల పాలముంచు నీళ్ళముంచు॥ భ॥

సేతురామదాసుడ నీచేతజిక్కితినయ్య । నాతాపత్రయము నణచి నన్నురక్షింపుమయ్య॥ భజన॥

27. కేదారగౌళ — మిశ్రగతి — అటతాళము.

(కరుణాజలధే దాశరధే) అనేమట్టు.

శ్రీవేణుగోపాల చిత్తశుద్ధిగ నె । చిన్మయునిగా సేవింతునే॥ శ్రీ॥

ఆవేళ యీవేళయను భేదములేక । యనవరతము నిన్నాత్మ నిల్పి గొల్తు । శ్రీ॥

కలుషచిత్తుడను గతినాత్తుండను । గాపురుషసంగతుడ । సత్సంగతి తలపేనెరుంగ మహానుభావ । సలిలింబుగ భవన్నామ । స్మరణమే తగదారకంబని జలజనేత్రనే దీక్షను । జాలగస్మరియింపుచుంటిని। శ్రీ।

సనకాదిమునినుత సద్గుణగణయుత । సచ్చిదానందమూర్తి జగన్మోహన। కనకాంబరాలంకృత । శ్రీనివాస దినదినంబును నీదుకీర్తన మను వుగనుబఠియించిభక్తిని । వినయముగనాతనువునీదగ । వినుతిసేయుచు బ్రతుకుచుంటిని॥ శ్రీ॥

దేవనీవెనాకుదిక్కనినమ్మితి । దినుండ సేతు రాముడ। నన్యదైవము నే నొల్లనీవాడ । సందియమేల నీవెనా కభయప్రదానము , నిగమగోచర చేసినన్నుం గావకున్నను। నమ్మునీపద కంజములు విడువనుగదయ్య। శ్రీ॥

28 హిందుస్థాని తోడి - ఆదితాళము.

(కరుణతో కృపామతి) అనేమట్టు.

గోపాలకృష్ణబ్రోవవే గోవిందకృష్ణ కావవే॥ గో॥

నీపాలబడితిని దైవము। నీకంటెనా కెవరుదిక్కయ । నీప్రాపుకోరితిని గదె । నిన్నెనమ్మితి నిజముగ॥ గో॥

అనాధరక్షకశ్రీధర । యార్తరక్షకహరిహరి । నీనామస్మరణము నిరతము నే జేయుచుంటిని నియతిగ। గో॥

కన్నీరుమున్నీరుగాగను గడగండ్లుబడుచుంటినిదైవము నన్ను సేతురామదాసుడగా వెన్నుడనీవేగాపుము। గో॥

29. హరికాంభోజి — ఆదితాళం,

(రారమార కోటిసుందర) అనేమట్టు.

బాలగోపాలబ్రోవవే॥ బా॥

లీలామానుషవిగ్రహా॥ బా॥

కాలవైపరీత్యమాయె గష్టసంసారినైతి। జాలదికుఱ్ఱలంజిక్కితి। స్వామి నన్నుగాపాడవే। బా॥

సామగానలోల యోసచ్చిదానందమూర్తి। వేమారువేడుకొంటి। నా మీదదయరాదె॥ బా॥

దీనదయాపర భవ దీయసేతురామదాసుడ। దీనుడనునరక్షింపవే దివ్యగుణాకరకృష్ణ॥ బాల॥

30 సురటి—ఏకతాళము — చతుశ్రగతి.

ఏమనివిన్నవింతునే। నామనోవ్యాధి వివరం॥ ఏ॥

భూమిభారము దీర్పంగబుట్టిన। పుణ్యపురుష ఫుల్లాంబుజలోచన॥ ఏ॥

కందర్పుని గన్నతండ్రి। డెందమునకుసరిలేదె। సుందరాంగ చులకగజూచిన। నెందుబోదు నవరేదిక్కు॥ ఏ॥

పాలకడలిశయననీదు పాదపద్మభజనంబున। గాలమంతగడుపుచుండునేల నీదయరాదేకృష్ణ॥ ఏ॥

సేతురామదాసుడ నాచిక్కులుదీరక చింతిలెదనే। కీర్తినైననగ్గడతేర్చిఖ్యాతిజెందుమోదేవ॥ ఏమని॥

31. శంకరాభరణం — అటతాళం.

(ఎంతచక్కని వియ్యాలవారు) అనేమట్టు.

వేణుగానలోల నా। వెతలుదీర్చి కడతేర్పవె॥ వే॥

ప్రాణికోటినావలె నిడుమల। బడినవాడేడులేడు॥ వే॥

సంచితార్థమంతబోయి సర్వశూన్యుడనైతినె। పంచపాండవులవలె వంచనపాలైతినె॥ వే॥

రంగుమీరనీపదసేవె। రక్షకమనితుదకుజేయుదు। భంగపాటులేక నీ। భక్తిపరుగ జేయగదే॥ వే॥

సేతురామదాసుడ నాతల, వ్రాతయిట్టులాయెను । భూతదయాపర మూర్తి హరి, భూతవ్యథునఁ జేయవె॥ వే॥

32. సురట — త్రిశ్రగతి — ఏకతాళము.

శక్తి వంచన మేమిలేక నీ । చరణ సేవ జేయుదు నె॥ శ॥

భక్త హరాయత్త చిత్త । బ్రహ్మాదిదేవవందిత॥ శ॥

ముక్తిమార్గ చిత్తశుద్ధి । మురహరనాకీయవె యా । సక్తిమీరనిను వేడుదు । సర్వాంతర్యామికృష్ణ॥ శ॥

కర్మమార్గానుసరణ కార్యమన్న నే నెరుగ । మర్మమేల నీపదభక్తి । మార్గమే తారకమని॥ శ॥

సేతురామదాసుడ నీ సేవాభ్యాసార్థి నే । రాతిరిపగలుఁ జేయు నీతి యుతుఁ జేయగదే॥ శ॥

33. శంకరాభరణం — రూపకతాళము.

(కల్లలుపల్కేరు పల్కేరు పోపో రేగోపికలార) అనేమట్టు.

దేవకీతనయ దయజూడుమోకృష్ణ । శరణార్థిని నే॥ దే॥

తావకంబగుభక్తి పథముం। దప్పక నేనడుచుచుండగ । గావవేకరుణాలవాల । కఠినచిత్తమేలనయ్య॥ దే॥

దానవిరసత సూతపుత్ర। ధర్మనిరసిత ధర్మతనయ । నేనునీవాడనన్న। ననరుగలుగదదేమయ్య॥ దే॥

అష్టకష్టంబులకులోనై । యంబుజోదరనీదుసేవా । తృష్టివిడువక జేయు నా । కష్టములు దప్పింపజూడవు॥ దే॥

సేతురామదాసుడను నీ। సేవాకైంకర్యపరుడ । నాతాపత్రయము దీర్చి । నన్నురక్షింపగదవే॥ దే॥

34. బిలహరి — అటతాళము.

(నీకునేనన్యుడన నీవునాలోలేవా) అనేమట్టు.

స్వామినాపైదయరా। దేమిసేయువాడనోర కృష్ణయేమనివిన్నవింతు। నేరదిక్కు॥ స్వా॥

పక్షిరాడ్వాహనయే। కక్షణాక్రందనమున। రక్షరక్షయనద్రౌపది।

కటకయంపు వలువలిచ్చితి । రక్షణార్థము నిన్ను నేనను, రక్తి సేవించినను నా యెడ గటక యేమీ కరుణింపవు । పక్షపాతమ దేమయ్యా॥ స్వా॥

అకుచేలా ద్రుష్టమేమొ । యటుకులిచ్చియు మగగాని । నాకాధిపు భాగ్యమిచ్చితి । నానాభంగులుగ । బాకారినుతపదనీ। పదయుగము సతతము తే దేకనిష్ఠనే గొల్చిన। నే ఫలము లేదాయె॥ స్వా॥

సేతురామదాసుడ నీ । సేవాకింకరుడను । నాతాపత్రయమణచి । నన్నుగ్రతార్థు జేయ రాతిరి పగలు ని రంతరము నిను వేడ నాతిల్లవాలదియే మొ। నా మొరవినవైతివి॥ స్వా॥

35. శంకరాభరణం — రూపక తాళము.

(ధ్యానింతు నిన్నే మనందున) అనే మట్టు.

దేవ వేణుగానలోల, నీవాడనె శ్రీవరంధామ॥ దే॥

భవనాశనకరమగు నీ। భక్తిమార్గమనవరతము । ధృవపదీక్షాపరుడను గా నవలంబించి చేయుదునె। కువలయేశ శ్రీనాథ । కోరిన నా కోర్కెలీవె భవదంఘ్రిసేవైక। పరతంత్రమునస్కుడనే॥ దే॥

కరుణారసపరిపూర్ణ । కనకవసనశోభితగాత్ర । హరిహాయ పూజిత పాద ।యార్త జనావనశీల। నిరతమునీ నామమె స్మరణమె నే జేయు చుందు కరివరద కావగదె । కష్టపీడిత సంసారినె। దే॥

సేతురామదాసుడనే జేయగలదియేమి లేదు । మాతాపితృలననీవె। నన్నిక చేకక్షింపవె రాతిరిపగలును నేను।సీతారిక నామమెపుడు జేసెనైన మాక్షికం భ। జించు చుందు చిద్విలాస। దేవ॥

36. ధీరశంకరాభరణము — ఏకతాళము.

(జానకీనాయక సత్యప్రదాయక) అనే మట్టు.

బాలగోపాల లీలావతార। బా।

నీలమేఘవర్ణ । నిన్నే గొల్చెద। బా।

ఎన్నోవిధముల నిన్ను సేవించిన। నన్ను రక్షించుట సున్న జేసితివి। బా॥

పాపవిదూర భక్త బాంధవ । శ్రీపతి నన్నుజోవ జేపట్టవుగదె। బా॥

సేతురామావన శ్రీమన్నారాయణ।నాతో బంతమునన్ రక్షింపవు॥ బా॥

37. శంకరాభరణము—అటతాళము.

(ఏడనున్నాడో భద్రాద్రివాసుడేడ) అనేమట్టు.

రావె శ్రీకృష్ణ। రక్షింపనన్ను॥ రా॥

నీవాడనని నేను నెరనమ్మియున్నాను। భావజజనక నా పాలిదైవమీవె॥ రా

తారకనామంబనినీ పేరుతప్పకతలతురా। సారహీనసంసారార్ణవ ములో దారితెలియక చిక్కుల దవిలిపడితినయ్య॥ రా॥

మేరుసమధీర నే జేసిన। ఘోరపాపముల భారమెక్కువాయె। భరియింపలేనయ్య కారుణ్యనిధినన్ను। గడతేర్పగతినీవె॥ రా॥

శ్రీ గార్హపత్యన నీపాదసేవక। సేతురామదాసుడ దూరికృతాప దుఃఖునిగనన్ను జేయుభారమునీ। దేయని భక్తి సేవించెద॥ రావె॥

38. బలహంస—అటతాళము.

(పాటినెంచక మాటిమాటికివాదింప) అనేమట్టు.

నీనామకీర్తనము సుగమగోచరనే। నేనాటికినిమరువ శ్రీనాధనేబహు చిక్కులుదీర్పని। చిత్తమేలరాదో॥ నీ॥

భావజజనక నా పాలిదైవమునా। ప్రారబ్ధఫలమోయేమో నీవాడనని నిన్నునిత్యము వేడిన। నీదయ రాదుగదె॥ నీ॥

గట్టిగనీనామము ఖట్వాంగుడు రెండుఘడియలు। బట్టుదల స్మరియింపగనట్టె మోక్షమిచ్చి యనుదినసేవకున। న్నాదారింపనెబూనవు॥నీ॥

సేతురామనామాశ్రితు నన్నురక్షింప। శ్రీకృష్ణపనిబూనవు చేతస్ఫూర్తిగనీ। సేవకింకరుడనే చేతులెత్తిమ్రొక్కెద॥ నీనా॥

39. అపహాసము—రూపకతాళము.

శ్రితగతజనబిరుదనీకు। చిద్విలాసమహిమమెన్న॥ శ్రి॥

గృతికృత్యంజేడులేము। కువలయంబునశ్రీకృష్ణ॥ శ్రి॥

శరణాగతరక్షకనే సిరతదీక్షనీనామ। స్మరణమెపుడు జేయుదునునీ। కరుణరాదదేమయ్య॥ శ్రి॥

భక్తబాంధవగోవింద ఫణిరాట్శయనాయనను। రక్తినిన్ను గొల్చెదనను। ముక్తిమార్గగాము జేయవె॥ శ్రి॥

పాతకుడనునీపాద భజనకైంకర్యాధముడ । సేతురామ దాసుడన । న్నేతీరున బ్రోచెదో గ॥ శ్రిత॥

40 కల్యాణి — అటతాళము.

(తల్లినిన్ను నెరనమ్మినానువినవే) అనేమట్టు.

కల్లగాదుజుమికంజదళాక్షకృష్ణనా।యుల్లమెల్లరంజిల్లసేయదభక్తిం॥ క॥

శ్రీధరజగదాధారమాంపాహి । సాధుమానసవాస భూధరధరమాధవనీదయ రాదుగనాయెడ। ననాధరక్షక బిరుదందితివిగదె॥ క॥

నీవెనాదైవమని నిత్యమేనునమ్మి । నీనామస్మరణంబు నిరతము జేయుదు నావెతదీర్పగ । నీకేలదోచుదో నన్ గావమరెవ్వరేదిక్కు నాకు॥ క॥

సేతురాముడనీ। సేవాదురంధరుడ । నాతలవ్రాలది యేతీరోగదె । భూతలమందున నావలెనిడుమల చేత జిక్కబడి । చింతిలువారులేడె॥ క॥

41. శ్రీరాగం — రూపకతాళము.

(వనజాసన వినుతానతి) అనేమట్టు.

నారదాదిమునివంద్య । నాధా శ్రీపరంధామ॥ నా॥

కారుణ్యసాగరన । నష్టజీవుగడ తేర్పవె ॥ నా॥

సదాభవత్పదారవిందము లెదన్నిల్పిగొల్చెద నే। నుదయంబను దిన వ్రతముగ నదయామదిరింగుమురుం । గదలకుండ బదిలపర్చి॥ నా॥

అనూనముగునీ నామజపం బనవరతము జేయుచు।వినిశ్చితనియమపూర్వకంబుగ।వినయంబనయంబు నునా।మనమందుంగన్పడంగొల్తు॥ నా॥

సేతురామదాసుడనా । దిక్కులపరిమితములుగదె।నీతలంపునాపైరాదేమయ్య । భూతేశానాతీరేరీతిని , బ్రీతిజూచిబ్రోచెదుగదె । నార॥

ఆరభి — ఆదితాళము

42 (కొలువై యున్నాడే) అనేమట్టు

జగదీశకృష్ణా । చారువిగ్రహ ॥జ॥

నిగమాంతవేద్య । నీరజాసనవంద్య । భగవంతభవదీయ । పాదసేవకుడనేను ॥ జ ॥

మురహర నాచిక్కు లుదీర్పుటకు। నీవేగ ప్రాపు నాదురితచయము
క్షమియించుటకు నీవేనాప్రాపు విరతపరహింస దప్పించుటకు । నీవేనా
కాపు గరుడగమనా సంరక్షణకు । నీవాదిక్కు గదయ్యా। జ।

పరమపావనం బగు నీపదసేవ । విధ్యుక్తముగ సరసమతియుతుడనై
నేజేయుచు యథావిధిగ । స్థిరచిత్తుడనై నీనామసంకీర్తనంబు । దేహము
పొంగ బరమానంద భావమున బాడుచు । నీభజనము జేయుదు। జ।

సేతురామ దాసుడను వాడనునే నోహరీదేవ । భూతదయాపర
మూర్తివిగ నీవు మహానుభావ। నాతాపత్రయమంతయు దీర జేసి దయా
నిధే। యాతతానుగ్రహవృత్తి గాపాడవె। శరణార్థి శ్రీకృష్ణ। జగ।

43. కల్యాణి — రూపకతాళము.

పరమపావనమూర్తి నీ। పాదపద్మభక్తుండనే। ప।
సరసమతిని ననుబ్రోవగ । సంకల్పింపగదే కృష్ణ। ప।
వాసవాదిసురవంద్య వ్యాసాద్యఖిల మునిసేవిత । భాసమానచరిత
నా। పాపములు క్షమింపగదే। ప।
భవన్నామసంకీర్తనంబు । పట్టుదలచే జేయు నన్నెవరే రక్షించువా
రీవేగద నిర్మలాత్మ। ప।
సేతురామదాసుడనో క్షీరాబ్ధిశయన । వినవే చేతనై ననట్టుకు। నీసేవ
జేయుభక్తుండనే। పర।

44. కల్యాణి -- ఏకతాళము.

చిదానందమూర్తి దేవ । సచ్చిదానందమూర్తి ॥ చి॥
హృదానందముగ నీపదారవిందము। లెదన్నిల్పిగొల్చెదగా శ్రీకృష్ణ। చి
ఓపలేనిచిక్కులచేనే। బ్రాపులేకబడలితినయ్య । యాపద్బాంధవ
యార్తజనావన కాపాడగదెనగా । కంజదళాయతాక్ష । చి।
శ్రీరుక్మిణీనాథ నేసేతురామదాసుడ। నారాయణావతార నన్నోబ్రోవ
గదవే మాయనిగన్న । సుకుమారశరీర। చిదా।

45 ఆరభి — రూపకతాళము.

(చూతాముర్ రారె సుదతులార రంగపతిని) అనేమట్టు.
మాధవభవన్నామ । మాధుర్యము దెలియుశక్తి। మా।

యీధరిత్రి నేరికిగల । దిందీవరదళశ్యామ। మా॥

పంచభక్ష్యక్షీరాన్నాది । బహుపదార్థరుచులెన్నగ మంచిదైననీ
నామ। మాధుర్యంబునకులోకువే॥ మా॥

పనసచూతజంబూద్రాక్ష। ఫలరసరుచులన్నియు , గనకవసనయుష్మ
న్నామ ఘనమాధుర్యమునకులొజ్జు॥ మా॥

సేతురామదాసుడనా । చేతనైనవరకునీ। ప్రీతిగోరినీనామం బాతత
భక్తిస్మరియింతును॥ మాధు॥

46 శ్రీరాగం— రూపకతాళము.

బృందావనలోల , భక్తబృందావనలోల॥ బృం॥

సందియంబదేలనను । సంరక్షింపుమోసుశీల॥ బృం॥

అక్రూరవరదనే నార్తిజెందితినిర , శక్రాది సురవంద్య శరణార్థిని
గాపాడర॥ బృం॥

యోగీశ్వర పూజితపాద సాగరగంభీరకృష్ణ । నాగరాట్శయన శ్రీమ
న్నారాయణబ్రోవగదె॥ బృం॥

సేతురామదాసుడనో శ్రీనాథపరంధామ , నాతెరగంతయు నెరింగి
నన్నడ తేర్పగదవే॥ బృందా॥

47. దేవమనోహరి—త్రిశ్రగతి — ఏకతాళము.

(గోపాలకృష్ణ నీగొప్పతనములెంచ గోపికలువ్నారు లే) అనేమట్టు.

కలకంఠార్చితపాద కష్టసంసారిన । నగ తేరం జేయగదే చలమేలనా
పైని సద్గుణగణసాంద్ర । సంరక్షింపవె శ్రీకృష్ణ। క॥

ఎంతవేడినగాని సుంతైననదయరా । దేమిసేయుదునయ్య చింతదీర
నాదిక్కులుబోగొట్టి , స్థిమితుంజేయవె శ్రీకృష్ణ। క॥

పరమపావననామ పాతకవిరామనా । ప్రారబ్ధఫలముదేమో కరమ
నురక్తిని న। న్నావవేడిన నీ। కరుణరాదుగదేకృష్ణ। క।

అష్టకష్టంబుల నార్తిజెందిననా । కాదరణములేదాయె నిష్టసిద్ధిగాక
యిల్లాలునేనుంగడు । నిడుమలబడుదుము శ్రీకృష్ణ। క॥

చిత్తజజనకన్నతండ్రి సేతురామదాసుడనా । స్థితిముందేమగునొకో
యెత్తుదెలియకనే నిక్కట్లపాలైతి । నీశ్వరకాపాడవె। కలు।

48. పున్నాగ — అటతాళము.

(ఏలవొంటిగనినుబొమ్మంటివి) అనెమెట్టు.

స్వామినామీద నేమియుదయరా। దేమిసేయుదునయ్యా॥ స్వా॥
నేమముతో నీనామ మేమరక స్మరియించిన। గామితంబీయక కడగం
డ్లబెట్టెదు॥ స్వా॥

నీలమేఘవర్ణ నీవెనాదైవమని చాలనమ్మియుండియు। సచ్చిదానం
దమూర్తి నాలాయమునీపాద। వనరుహంబులసేవ జాలభక్తిని జేయుదు
సాధుజనవంద్య॥ స్వా॥

పరమపావనమూర్తి పార్థసారథినీ। సరివేల్పులేరు లేరు స్పష్టమని
గనుక కరిరాజవరదనా। కష్టములుదీర్పంగ మొరబెట్టుచునునీకు। మ్రొ
క్కులిడుచున్నాను॥ స్వా॥

ఆపద్బాంధవుడ వార్తశరణ్యుడ। వాపదోద్ధారకుడ వనుచునంద
రందురు। శ్రీపతిశ్రీకృష్ణ సేతురామ దాసుండ। నాపాప మదియేమొ
నామీదదయరాదు॥ స్వామి॥

49. రామప్రియ — త్రిశ్రగతి — ఏకతాళము.

నీవెనాకుదిక్కనినమ్మితి గోపాలకృష్ణ। నీకంటెనెవరులేరయ్య॥ నీ॥
కావుకావుమనుచువేడ। గావబూనవుకంసారి॥ నీ॥

పాపులనెందరినిబ్రోచియు గోపాలకృష్ణ। పాపమగున నన్నుబ్రోచి
నను। శ్రీపతినీపాదసేవయె ప్రాపనినెరనమ్మియుండి। రేపుమాపుజేయు
చుండిన నాపట్లందయరాదె॥ నీ॥

నీనామకీర్తనంబును గోపాలకృష్ణ। నీయందలిభక్తిచేతను। నానా
మార్గములజేతు నారాయణపరంధామ। యేనాటికినారక్షణ మేమినా
కుగర్తవ్యము॥ నీ॥

సేతురామదాసుడనేను గోపాలకృష్ణ। నాతలవ్రాలెట్టులున్నదో।
నీతాత్పర్యంబదేమొ నేనెట్టులదెలియవచ్చు। నీతారకనామమంత్రము
నేనెప్పుడుజపియించెద॥ నీవె॥

50 మేచకల్యాణి-ఆదితాళము.

(హరినరకేసరి విమలవాగ్ఝరి) అనేమట్టు.

దేవనిత్యానందభావ లోకావనస్వభావ। మహానుభావ శ్రీకృష్ణ॥ దే॥

దేవేంద్రాదులైననీ వారమంచుర్గా। భావంబుననిల్పి సేవింతురే। నీవేనాదైవమని నీలకంఠవంద్య సేవించెదనే। దే॥

దురాత్ములగునా సురారిసంఘము। పురాణపురుషబలిమార్ప। విరోధివర్గము హరింపెరియని సురేంద్రాదులెంతో మురవంగ। స్మరజనక సురవంద్య పరమపవిత్ర పావననామ। నన్గాపాడవె॥ దే॥

పాపకర్ముడగా బండితపోష్ట। తాపససేవ్య యోపరంధామ యేపగి దిన్న న్నేలుకోవుదువో। శ్రీపతిదేవా చిన్మయరూప యూవదోద్ధారకనగ జేపట్టగదవే। చిన్నచూపుచూడక శ్రీకృష్ణగోవింద॥ దే॥

శ్రీరుక్మిణీశ సేతురామదాసుడ। సారహీన సంసారకష్టములు। భారమెక్కువై బడలికజెందితి। నేరిమిలేదయ నిర్వహించుటకు గారుణ్యసాగరనీ। కటాక్షవీక్షణ మనుగ్రహింపవే॥ దేవ॥

51. ధన్యాసి—ఆదితాళం.

(పరాకుసేయుట పాటిగాదుర) అనేమట్టు.

నిన్నేనమ్మితి నీరజాక్షుడయో। నిగమాంతవేద్య॥ ని॥

కన్నడసేయక కాపాడగదే। కరుణాంతర్యామి శ్రీకృష్ణ। ని॥

చిరకాలమునీసేవజేసినను జేపట్టవదేమి। పరమదయాళుడవని బిరుదుండియు బాలింపవునా పాపకర్మఫలమా॥ ని॥

నావార్ధక్యము నానావిధముల నలకడపడెగదవె। భావజజనక పార్థసారధి ప్రాపీవెనాకు॥ ని॥

రక్షితసజ్జన శిక్షితదుర్జన పక్షివాహనపరమాత్మ। కుక్షిస్థితబ్రహ్మాండపాలక రక్షింపుము సేతురామదాసుడను॥ నిన్నే॥

52 దర్బారు—అటతాళము.

(శుకయోగిజెప్పెకృష్ణునికథయభిమన్యుసుతునకుహితవుగను) అనేమట్టు.

పాకారిపూజిత పాదాంబుజనగ। బరిభూతవ్యధుజేయవే॥ పా॥

నాకష్టములుదీర నాకేవెరవులేదు। నీకైంకర్యమె దిక్కు నిగమగోచరకృష్ణ॥ పా॥

మతిహీనుడనై మంచిచెడ్డలుగానక యతిధన వ్యయము జేసి యతిగ చిక్కులబడితి। క్షితినిల్వసంసార స్థితిదుస్తరంబాయె। వెతలుదీర్పనాకు వేరెప్రాపెవరయ్య। యితరదైవంబులను నే నెన్నటికినమ్మినదిలేదు। రతీమనోహరజనక దేవా। రక్షించి బ్రతికింపుమయ్య॥ పా॥

అనుదినము నీకీర్తనమె బాడుచుందు। దనుజాంతక పరమధర్మబోధక దేవ। మనసిజారివంద్య మాధవపరంధామ। యనఘయనయమునినాశ్రయించినవాడ। సనకనుత నతితంబునీపద సరసిజంబులె గొల్చుచుంటిని। వినయపూర్వకప్రార్థనంబున వేడెదను గరుణింపగదవే॥ పా॥

శ్రీలక్ష్మినాథ నేసేతురామదాసుడ। వాలాయము నీవాడగ నమ్మియుంటి। గాలవైపరీత్యమున గడగండ్లబడుచుంటి నీలమేఘశ్యామ నీవే నాకుదిక్కు। కాలయాపన మేలనే నాకష్టములు తీర్పంగగదవే। యేలీల నన్గావఁజూతువో యేమని మొరలిడుదునయ్య॥ పా కా॥

53. అమీరుకల్యాణి—అటతాళము.

(పరమహంసయో నృపమణునకు జెప్పె) అనేమట్టు.

స్వామినామీద నేమియుదయరా। దేమిసేయుదునో కృష్ణ॥ స్వా॥

సామజవరద నీ నామస్మరణం బెపుడు నేమముతో జేసితి నిరతదీక్షబూని॥ స్వా॥

అనాధరక్షక యాశ్రితశరణ్య కనకాంబరధర కరుణాపారావార। ధనహీనదశకులోనై తాళగలేక యనిశమార్తి జెందితిని నోర్వగలేనె మునిజననుతపాద రక్షింపవె పనిగాని గోవింద। మనుజలోకములోననా మాడ్కి నేమానవుడు మిక్కిలి। దినదినా వత్సరంపరల క్రుళ్ళుడుగదె దీనావన॥ స్వామి॥

భవదీయ భవ్యపాదప్రసాదకణలబ్ధి। ధృవమనినీ చరణతో యజభక్తినుంటి శివనుత చరిత నే నిజముగనీ। సేవకింకరుడనై తినీదయ లేదె। నెపరివాడనగుదు భక్తబాంధవ। భవభయనాశక కువలయేశ్వర గోపాల

కుటిలకుంతలి రుక్మిణీప్రియ । నవనీతదధిచోరయో కరుణాలవాల శర ణార్ఙిని। స్వా॥

శ్రితరక్షణైకబిరుద శ్రీమన్నారాయణనీ। సేతురామదాసుడ చిక్కు లంజిక్కితినాకు। బ్రతుకుదెరువలేదె యేమిసేయుదు వెతలపాలైతిగదవె నాసంసారస్థితి ముందెట్లుండునో । ముందికనాగతి యేమిగానున్నదో । పతితపావననామ నీపాదభజనము తారకంబని। సతతభక్తిని జేయుచుం దును స్వామినను గాపాడగదవె॥ స్వామి॥

54. యదుకులకాంభోజ — అటతాళము.

(హరికథా సుధాపానముసేయవే వసుధానాధ) అనేమట్టు.

గుణమణినినేగొల్తునుగానదా । గోపాలచూడామణి॥ గు॥

అనుకోను పరిపూర్ణుడవగునీవేనాకుది। కృనుచు నీనామస్మరణము జేయుచు॥ గు॥

నీపాదకమలంబు నిరతంబు సేవించుచు । బాపనార్ధినై పలుతె రంగులబూజించుచు నోపాతకవిరామ । నిన్నేనమ్మితి శ్రీపతిపరంధామ నాకునీవెప్రాపు సుగుణధామ నన్నావనీవె కాపుగోవిందనామ। నన్నడ తేర్ప నోపుదైవమునీవెగద యనియోజనార్దన నీవెనాకుం బ్రోవనుచునీకీర్త నంబును। రేపుమాపని యనక బాడుదు॥ గు॥

పరిపోషిత భవద్భక్తజన సముహ । గిరిజనాథ ప్రిభుప్రీతి సురగణ వంద్య గిరిధరదేవ మ్రొక్కెద । నీకుపరమానంద భావజాగేలనే। కరుణ చేసన్నావసదా జేయుదు । మురహరనీసేవదయానిధ పరమపురుష నేను చేసిన పాపములుక్షమించినన్ను । సరసమతి బావనుని జేయవె । సాధు జనసంఘ సంరక్షక॥ గు॥

చేతోమోదమునసీ సేవకైంకర్యము । సేతురామదాసుడ చిరకాల మునుండి యాతతభక్తితోడ । జేయుచుంటిదగురీతి సద్బుద్ధితోడ। నది యేనీకుబ్రీతియను మనముతోడ । నీయార్తరక్షకఖ్యాతి నమ్మకముతో డ । మహానుభావ సీతారకనామమంత్రము నేనెప్పుడు జపియించెద । నాతాపత్రయము దీర్చి నన్నాపాడగదే శ్రీకృష్ణ॥ గుణ॥

55. కమాసు—ఏకతాళం—చతుశ్రగతి.

(జయజయమంగళ లయపరమేశ) అనేమట్టు.

మురహరనగధర ముక్తిప్రదాత॥ ము॥

కరుణాసాగర కంజదళాక్ష॥ ము॥

నిన్నే నమ్మితి నీరజనాభ। కన్నడ సేయక కాపాడగదే॥ ము॥

పరమానంద భావఫాలాక్షవంద్య। పరమ భావమే లెప లింపవె నన్ను॥ ము॥

శ్రీసతీప్రియ నే సేతురామదాసుడ॥ నీసాటిదైవము నేగానలేనే॥ ము॥

56 సురటు—ఏకతాళము.

గోవిందం భజేహం। గోపగోపీనాయకం॥ గో॥

భావజారిపూజితపాదం। భక్తసందోహ మానసవిహారం। గో॥

సనకాదిమునినుతచరితం సత్యభామా తాడితశిఖరం। కనకవసనశోభితగాత్రం। కంజదళాయతనయనం॥ గో॥

అజరుద్రాదిసురగణవంద్యం। నిజభజనపరాయత్తచిత్తం త్రిజగన్నుతాద్భుతదివ్యతేజం। భుజగనాయక వాహనమహావిష్ణుం॥ గో॥

శ్రీమన్నారాయణ కల్యాణస్వరూపం, సేతురామ దాసావనం, భూమిభార నాశకావతారకృష్ణం। భుక్తిముక్తిదాయక సచ్చిదానంద మూర్తిం॥ గోవిందం॥

57. ఫరజు—ఆదితాళము.

(రంగారాజ యిందురారానాయన) అనేమట్టు.

రాధామనోహర రారాకృష్ణ॥ రా॥

ఆధారహీనుడ నార్తిజెందితిజగ। న్నాధననుబ్రోవవేగరార॥ రా॥

ఎన్నోదినములనుండి నిన్నేనమ్మిననన్ను। జిన్నబుచ్చెదునీ చిత్తమేలోప్పెర॥ రా॥

ఆశ్రితకల్పవృక్షమనుచు బిరుదుండియు। నాశ్రయించిన నన్నధోగతిపాల్జేసితి। రా॥

రాత్రిరిపగలుడగుకీర్తి న్నినుభజియించు। సేతురామదాసుడని జేపట్టిరక్షింపను॥ రాధా॥

58. అఠాణారాగము — అటతాళము.

(అక్కరలేదుఓయవ్వ పాలివ్వ) అనేమట్టు.

నీరజనాభం భజేహం। నీ॥

నీరజాసననుతం। నిర్మలనిత్యానందం॥ నీ॥

సారహీన సంసారార్ణవతారకం। మారకోటిసుందరం మేరుసమాన ధీరం॥ నీ॥

గోపగోపీనాయకం గోవర్ధనోద్ధారకం। పాపకర్మనాశకం। భక్తిముక్తిదాయకం॥ నీ।

సేతురామదాసావనం। శ్రీగోపాలకృష్ణం। పూతనప్రాణహరణం। ఫుల్లసరోజనయనం॥ నీరజ।

59 దేవగాంధారి — ఆదితాళము.

(క్షీరసాగరశయన) అనేమట్టు.

ఫాలలోచనవినుత నన్నాపాడగదవే శ్రీకృష్ణ॥ ఫా॥

నీలమేఘవర్ణ నీపాదసేవానిరతి। గాలముగ నుపుచుందు రక్షీకృష్ణ। ఫా।

దీనరక్షకవినవె నాకు దిక్కునీవె శ్రీకృష్ణ। నీనామకీర్తనంబు నిరతము కేయుచుందు గానన్నై నరావుగదే శ్రీకృష్ణ॥ ఫా॥

సేతురామదాసుడను నాచింతలు దీర్చగదే కృష్ణ। పాతకరహితు జేసి భవభయార్తిదీర్చి పితరాగు జేయుమా శ్రీకృష్ణ॥ ఫాల॥

60. గౌళిపంతు — ఆదితాళము.

(కటాక్షించుతిరుపతి) అనేమట్టు.

మహాత్మకృష్ణ కృష్ణ॥ మ॥

మహానుభావనను రక్షింపవె। మ।

పాపకర్ముడను బాపాత్ముండను। నీపాదసేవనిత్యము జేయుదు। మ।

రక్షితసురబృందరాక్షసాంతక। పక్షిరాడ్వాహనబ్రహ్మాదిసంసేవ్య। మ॥

సేతురామదాసుడ శ్రితకల్పద్రుమ। యేతీరునన్నేలుకొనియెదో। మ।

61. కేదారగౌళ — అటతాళము.

(ఇందీవరశ్యామరామ) అనేమట్టు.

గోవర్ధనోద్ధరరార। యోగోపాలచూడామణిరార॥ గో।

కావుకావుమని గట్టిగ మొఱలిడు నన్నీవాదరింపవు నీరజాసనవంద్య యేవగనునీదయగల్గునో యేమిసేయుదుననుచు నాభావమున జిక్కులను బడుచు బరితపించుచుంటిదేవ। గో।

పరదైవములనమ్మలేదుగ యనవరతము నిన్నేనమ్మితిగ పరమదయాళో యోపాతకవిరామహర పూజితపాద యనాథరక్షక స్థిరమతిని నీచరణసేవయె నిరతిభక్తిని నమ్మిజేసెడు నరునినను రక్షింపగను నీకరమక ధర్మంబుగాదె॥ గో।

కరినిగాచిన హరివిగావవ నాగాసిదీర్చి బ్రోవలేవ పరిపరివిధముల భ్రాంతింజెడి నన్బరిభూతార్తు జేసి పాలింపనోపవు కరముదుస్తర కష్టములచే గందికుందుచు గాలయాపన జరుపుకోజాలనిదాసుడ బాలిడైనను దోచి బ్రోవవు॥ గో॥

శ్రీనివాసచిద్విలాస నేనీసేతురామదాసాధముడ హీనభాగ్యుడనేని డుమలబడితిని నేనవరి నితరులనేర్వ యాచింపగ సూనశరునింగన్నతండ్రి శూరరాక్షససంహారిపూనినను రక్షింపవలెజుమి ఫుల్లాబ్జలోచనహరి॥ గో॥

62. హరికాంభోజి—త్రిశ్రగతి—ఏకతాళము.

(శ్రీశ దనుజేశ మదవినాశ) అనేమట్టు.

బాలగోపాలబాలకృష్ణ। దయానిధే। బా।

లీలామానుషవిగ్రహా। నాకుంగాలమెక్కువలేదుగ సుశీలనిన్నేనమ్మితినదేల నన్నావనెల్లవు। బా।

నీపదసేవేగ నేజేయుచున్నాడనె నేపాటియునున్నామది నేలోపము లేదుగదె। పాపంబులక్షమియించి। పావనునిగాజేసి। పాలింపవె నన్గృష్ణా। బా।

వాసవనుతతేజ శ్రీనివాసరుక్మిణీశ। వ్యాసాది మునివంద్యా వందేహంగోవిందా। నేసేతురాముండ। నీవే నాకుంబ్రాపు నీరజాక్ష రక్షింపవె॥ బా॥

63. కన్నడ—రూపకతాళము.

(శ్రీనారదనాద సరసీరుహాభృంగ శుభాంగ) అనేమట్టు.

గోపాలబాలకృష్ణ గోవింద నీభజనపరుడ। గో।

రాపుజేసెదేలనన్నా । రక్షింపగదేమహాత్మ॥ గో॥

మారకోటి సుందరరూప । మధుసూదనచక్రధర । ఘోరదానవాంతకమో నీరజాసనాదివంద్య॥ గో॥

శరణాగతత్రాణ బిరుదువహించియున్న గరుణజూడవ దేమయ్యా గరుడగమన కంజాక్ష॥ గో॥

క్షీణదశన్ సంకటపడు సేతురామదాసుడనో వేణుగానలోలా నావెతలు దీర్చి కాపాడవె॥ గో॥

64 గుమ్మకాంభోజి — అటతాళము.

(భజరే భజమానసరామం) అనేమట్టు

దనుజాంతక నీదయరాదేకృష్ణ॥ ద॥

మనసిజుగన్నతండ్రి మాధవమాంపాహి॥ ద॥

కలశాంబుధిశాయికనకాంబరధరసలలితమతినన్ విలసిల్ల జేయువె॥ ద॥

ధరణీధరధర కరిరాజవరద కరుణజూచి నన్ను గావగదేకృష్ణ॥

శ్రీరమానాథ చిన్మయగాత్ర చేరదీసిబ్రోవవె సేతురామదాసుని॥ ద॥

65 ఫరజు — ఏకతాళము.

(దాశరథివంటి పరదైవమేడె) అనేమట్టు.

గోపాలకృష్ణ నాపాపీవెగద॥ గో॥

నేనేపరదైవము నెరుగంగదె॥ గో॥

ఆపదోద్ధారకయాపజ్జావనరాపేలనన్ బ్రోవ శ్రీపతిపరంధామ॥ గో॥

ఓశివార్చితపాద యోంకారస్వరూప శ్రీశాపరమేశ నాకేశాది సురవంద్య॥ గో॥

శ్రీసత్యాప్రియ దేవసేతురామావన భాసమానరూప భద్రస్థితి బ్రోవవె॥ గో॥

66. కల్యాణి — రూపకతాళము.

(దేవీ మీనాక్షీముదం దేహిమేసతతం) అనేమట్టు.

దయరాదే శ్రీకృష్ణ! ధాతృపూజితచరణ॥ ద॥

నియమపూర్వకవ్రతముగ । నీనామముస్మరియింపుచు భయభక్తుల

నీభజనము । కట్టుదలగ జేయుచునవి నయమనస్కుండనై । నాయభీష్ట సిద్ధికొరకు నియతినీకీర్తనంబు, నిర్మలాత్మ బాడెదుగదె॥ ద॥

కనకవసనధారి గరుడవాహనసంచారి । దినకరశతకోటి తేజ దివ్య మంగళవిగ్రహా । యనవరతం బేనీ పాదాంబుజములు సేవించుచు సన కాదిముని సేవిత సన్నుతింపుచుంటింగదె। ద॥

సురరిపుమదహరణ కరివరదననావవె। పరమభావమేలనినా । పాలి దైవమీవాగదె। నిరతదీక్షబూని నేను నీసేవాకైంకర్యము, పరమభక్తి జే యుచునే। పరమపురుషభక్తావన॥ ద॥

శ్రీరుక్మిణీనాథ సేతురామదాసుడనే। నేరమేమిలేదునాయెడ । నిన్నే నెరనమ్మినవాడ । సారహీన సంసార భారంబ పారంబయె । నేరీతిం బ్రోచెదో నీ । వేగతిగద నిశ్చయముగ । దయ ।

67 పున్నాగవరాళి - ఆటతాళము.

(రారాకుమారి కన్నమిముద్దులివర బంగార) అనేమట్టు.

మందభాగ్యుడనే గోపాలకృష్ణ మందభాగ్యుడనేను ॥ మం॥

మందభాగ్యుడనాయందు నీదయరాద । మందానందమూర్తి మాధ వబ్రోవవె । మం ॥

రెండేగడియల కాలముఖట్వాంగుడు నిన్నింమనమున గొల్వనా ఖండకైవల్యమునవి కరుణించియు జరకాలముద్దండభక్తి సేతురామ దాసుడన్నిపాదసేవ మెండుగను నే జేసినను నామీద నీదయరాదుధర్మ మెయుండ నాకెంకెవరయ్య యాదరించికడ తేర్పవె॥ మంద ।

68 కళ్యాణి – ఏకతాళము.

నందునుద్దుపట్టికృష్ణ నన్నాదరింపవే । నం ॥

వందనమర్పించెదనె గోవిందరక్షింపవే। నం ॥

బాలయోకరుణాలవాల భక్తజనరక్షణశీల యాశ్రితాఘపోషణలోల గోపీసతీవంచన లీలయనాథ జనబృందపాలనక బ్రోవనీగయ రాదేల యోగోపాలబాలకృష్ణ । నం ।

యిటుక బ్రోవవే పరమేశబ్రహ్మాండ సృష్టిస్థిలయేశ సేతురామదాసా

పనేక నిన్నేనమ్మితి జగదీశ శతకోటి సూర్యప్రకాశ జగత్ప్రశోభితస్వప్రకాశ యోగోవింద బాలకృష్ణ। నందు॥

69. శహాన — ఏకతాళము.

(రామవందనం, ఓరఘునందనం రామ) అనేమట్టు.

బ్రోవవె యోవేణుగోపాలకృష్ణ బ్రో॥
నీవాడనే నిన్నేనమ్మితికృష్ణ। బ్రో।
ఇమ్మని వరములిమ్మని నమ్మినినునేడిన సన్మతిలేదాయె॥ బ్రో॥
నీదయనిగమాంతవేద్య రాదదేమయ రాధాలోల। బ్రో॥
దాసుడని నేసేతురామ వాసవాదిసన్నుత వందేహంకృష్ణ॥ బ్రో॥

70 బిలహరి—అటతాళము.

రావేశ్రీకృష్ణ దేవనను రక్షింప। రా॥
నీవేనాదైవమని నెరనమ్మియున్నా నన్గావరావదేమయ కాంచనాంబరధర। రా।
ఎన్నోదైవములున్న నిన్నే నెరనమ్మినాడ గన్నడజేయక కరుణాలవాలబ్రోవవె। రా।
భక్తబాంధవ నీపాదపద్మముల నాసక్తిచేభజియింతు సంరక్షింపవె దేవ॥ రా॥
సేతురామదాసుడ రాత్రిరి। పగలనక సీతారకనామము। నిత్యము భజయింతు॥ రావే॥

71. జంఝూటి—రూపకతాళము.

ఆనందమూర్తి నేను కనులగంటిని) అనేమట్టు.

గోపాలకృష్ణదేవ నాప్రాపునీవెగదె॥ గో।
నాపట్లందయరాదె నాబ్రతుకు దెరవెట్లో॥ గో।
నీసేవాకింకరుడన్నా నిర్భాగ్యదశదొలగదు శ్రీసదానందమూర్తినన్ జేపట్టంగానొల్లవు।గో॥
పరిపోషితసాధుసంఘ పరమాత్మమహానుభావ దరిజేరన్ దారిజూపు నాదారిద్ర్యదశదొలంగి। గో॥

దయానిధే సేతురామదాసుని సంసారభయవిదూరు జేసినన్ను భద్ర స్థితికిం జేర్పవే ॥గోపాల॥

72 తోడి — అటతాళము

(ఎందుదాగినాడు శ్రీరాముడు) అనేమట్టు

ఎవరుదిక్కు నాకుశ్రీకృష్ణ ॥ఎ॥

భవభయహరనీపాదసేవకుడనే నెపరివాడనగుదునీవునన్ విడనాడ॥ఎ

చిరకాలమునీసేవకై ంకర్యము నిరతవ్రతదీక్షగ నేజేయుచుంటిని॥ ఎ॥

ఎన్నోవిధముల సర్వేశ్వరనిను । నమ్మియున్న నాయాసంతె । సున్న జేసితిగదె ॥ ఎ॥

శ్రీలక్ష్మీనాథ నేసేతురామదాసుడ కాలమై పరీత్యమాయె గడగండ్ల పాలైతి ॥ ఎవరు॥

73. శుద్ధసావేరి — అటతాళము.

(నీరజనాభుని నెరనమ్మినవారి) అనేమట్టు.

శ్రీవేణుగోపాల చిన్మయస్వరూప । శ్రీకృష్ణమహాప్రభో॥ శ్రీ॥

నీవేనాకై నమ్మి నెరనమ్మియుంటినన్నేరీతిబ్రోచెదవో గోపాలకృష్ణ॥శ్రీ॥

కనులపండుగగాగన్పడినాకు నాకష్టముల్ గడ తేర్పవే యనువుమీర నన్నాదరించి నాయాపదలుదీర్పగదె శ్రీకృష్ణ॥ శ్రీ॥

ఎంతోదీనతను నేనెంతగప్రార్థించిన సుంతైనదయరాదుగ పంతమ నాతోను పరమాత్మవాసుదేవ పతితునన్నుంగావవే॥ శ్రీ॥

శ్రీకరకృపైక చిత్త సేతురామదాసుడ మితిలేనిజిక్కులంబడి యతి గుందుచున్న నన్నాపదోద్ధారక హితమతిన్ గరుణింపవే॥ శ్రీవేణు॥

74. నాయకి - ఆదితాళము.

(పరినీ సరివేల్పెవరురకృష్ణ ధారుణిలోపల తలచితలచిచూడ) అనేమట్టు.

నీనామకీర్తనమేసతతముకృష్ణగానము జేయుచుగాలముగడుపుదు॥నీ॥

నానాభంగుల నా వెతల్దీర్పగ నాథా మొరలిడ నన్నావదలవు ॥ నీ ॥

ఇష్టకష్టముల నలసితిగదెనా । కష్టముల్దీర్చి నన్గడ తేర్పవుగదె॥ నీ ॥

సుమశరజనకసుగుణవిభూష యమరవంద్య నన్నాదరింపవుగదె॥ నీ॥

రాధాప్రియ సేతురామదాసుడ ననాథన్న న్గరుణంజూడవుగదె ॥ నీ॥

75. శహన — ఆదితాళము.

(తనయుడుగల్గెజూడరె నాకుముద్దుల) అనేమట్టు.

సుమశరజనకబ్రోవవె సుత్రామవంద్య॥ సు॥

కమలనేత్రకృష్ణ కష్టసంసారినన్ను॥ సు॥

భవదీయ దివ్యపాద పంకేరుహములునే ననవరతవ్రతవిధిగా భవభయార్తిహర భజియింపుచుంటినే॥ సు॥

రక్షితసజ్జనబృంద మహానుభావ శిక్షితదుర్జననాయెడ నక్షీణకరుణాకటాక్షవీక్షణము ప్రసరింపవె॥ సు ॥

శ్రితపోషణాంచిత చిత్తదయాసింధో సేతురామదాసుడ నన్ను హతకలుషు జేసి పరిశుద్ధాత్ముగ జేయగదవె॥ సుమ॥

76. పంతువరాళి - ఆదితాళము.

(వదలనేరనయ్య శ్రీహరిని నాదుచిత్తము) అనేమట్టు.

వదలనేను వదలశ్రీకృష్ణ నీపాదము॥ వ॥

సదయహృదయ నాహృదయస్ఫూర్తిగ కదలకబట్టితికరుణాజలధే॥ వ॥

ఎన్నోవత్సరములనుండి నిన్ను సేవింపుచు నున్నాడనుగదే నేనెన్ని విధంబుల విన్నవించినను చిన్నబుచ్చెదేమొ చిత్రవిచిత్రము॥ వ॥

సంసారకష్టములెంతో నన్నుంబ్రాణహింసం జేయుచున్నవిగహంసవాహనాద్యాదిత్యవందిత కంసనృశంసా కాపాడంగదె॥ వ॥

శ్రీయగపతిపరమాత్మ నన్నురక్షింపవె సేతురామదాసుడవేఱుమాటలేల వేదాంతవేద్య నీయుందేమది నెలకొల్పినాడనె॥ వదల॥

77. కేదార — ఆదితాళము.

(శ్రీరామచంద్ర నరేంద్ర రక్షితామరేంద్ర) అనేమట్టు.

గోపాలకృష్ణ మహాత్మ శిక్షితాసురకాండ ॥ గో ॥

నాపాలిదైవమీవెయనినమ్మితినాదుకోర్కులిచ్చికృతార్థు జేయవె॥ గో॥

పాపకర్మరతి బ్రబలుజనంబుల పాపములను బాపనోపు నీవేనాపాపములను బాపబ్రోవని నినువేడెద బద్మనాభ పాపవిదూర బ్రోవవె॥ గో॥

మనసిజ వైర్యాదిసురార్చిత పాదయుగళమాధవ శ్రీ నారదాదిముని వంద్య యనుదినము నీపాదపద్మభజనము వినయవిభూతిమెరయ జేయుదు గావవె ॥ గో ॥

సదమలగుణమణిగణ శోభితమో సదానంద సేతురామ దాసుడనే సదయహృదయ నీతారకనామము సదాజపింతు నన్గరుణంజూడవె॥ గో॥

78 హిందూస్థాని తోడి - రూపకతాళము.

(బారో బాపురుతాణిగె) అనేమట్టు.

సంసారకష్టంబుల హింసకు దాళగలేనె కృష్ణ ॥ సం॥

ఘోరాట్వియనా యైన ఋణబాధ దుస్తరమాయె నను మాతృము సతాలేద యంబుజోదర బ్రోవగదె ॥ సం ॥

దెబ్బదినుూడేండ్లునిండె నిబ్బరము హ్రాస్వమాయె గొబ్బునరక్షింపగదె గోవిందమహానుభావ॥ సం॥

రాధామనోహర సేతురామదాసుండ ననాధన్నను గరుణింపవె సాధుజనావనదేవ ॥ సంసార ॥

79. భైరవి - రూపకతాళము.

(నారాయణనీపదములువమ్మితి ననుగరుణింపుము. అనేమట్టు.

శ్రీగోపసతీప్రియ శ్రీమన్నారాయణ నాగభూషణార్చితపద నాదైవంబీవె కృష్ణ ॥ శ్రీ ॥

అరుణోదయాత్పూర్వంబను దినము నీ నామస్మరణము నేజేయుచుంటి సాక్షాత్కరింపగదె॥ శ్రీ ॥

కలుషాత్ముడనాజీవిత కాలంబెక్కువలేదుపలుమారులుప్రార్థించెద బాపవిముక్తుంజేయవె॥శ్రీ॥

దాసాధమసేతురామదాసుడ నోపరంధామనీసాటిదైవములేదె నీసేవాకింకరుడనె ॥శ్రీగోప॥

80 యమునాకల్యాణి— ఆదితాళము.

(రక్షమాంసదామురామహరేశ్రీ నారసింహ) అనేమట్టు.

రక్షణమెగోరినాడనె గోపాలకృష్ణ ॥ర॥

అక్షీణదయాకటాక్ష వీక్షణమెనిక్షేపము ॥ర॥

నీమహాత్మ్యవస్తుస్థితి నెరుగువారేరు లేరు సామజ వరదానన్ను సంర క్షింపగదె దేవ ॥ర॥

పృథివిలో నన్నుబోలుపుట్టు పాపిలేడయ్య యధమాధముడను నీవే యాదరించిబ్రోవగదె ॥ర॥

శ్రీసదానందమూర్తి సేతురామదాసుడ నాదోసములం బారదోలి నీసన్నిధి జేర్చుకొమ్ము ॥ రక్షణమె ॥

81 మేచకల్యాణీ — ఆదితాళము.

(సరసిజదళాక్షశౌరిహరి) అనేమట్టు.

ఆగమవేద్య దేవకృష్ణ ॥ఆ॥

భోగిశయనగోపాలముకుంద ॥ఆ॥

దినకరశతకోటి దివ్య తేజయుతమనసిజ జనకకృష్ణగోవింద ॥ఆ॥

నారదసంగీతనందిత హృదయశ్రీరమణీశ చిద్విలాసకృష్ణ ॥ఆ॥

శ్రీయార్థిని నే సేతురామదాసుడ నాయాపదల్దీర్చినన్బ్రోవుమురారి ॥ఆ॥

82 షణ్ముఖప్రియ — ఆదితాళము.

(నలుగిడరార సుందర యదుకులసుకుమార) అనేమట్టు

గోపాలకృష్ణహరి గోవర్ధనోద్ధర ॥గో॥

నీపాదపద్మము నేనమ్మిగొల్తును నాపాపమదియేమొన నావనెల్లవు ॥గో॥

నీనామకీర్తనమునిరతిము చేయుదునో నారదవంద్య యోంకారరూప ॥గో॥

భక్తజనబాంధవభవభయహార దేవముక్తిదాతవీవెమురహారబ్రోవవె ॥గో॥

శ్రీశాదేవేశ సేతురామదాసుడ నీశజగదీశనన్నేలుకోపరమేశ ॥గోపా॥

83 శహన — అదితాళము

(తనువును బెంచినతనకు నేమిఫలమాను) అనేమట్టు

సర్వశక్తిసంపన్న సర్వాంతర్యామివీవె నిర్వాణదాతవీవె నిగమ సంచారకృష్ణ ॥ స ॥

పాపాత్ము లెందరో నీయెడ భక్తిం గృతార్థులైరి నీపాదభజన జేసితి శ్రీపతినన్గావడవు ॥ స ॥

సామజవరద నీనామకీర్తనమెపుడు నేమముతో నే జేయుచుంటనీద యరాదుగదె ॥ స ॥

ధరణిని సేతురామదాసు కనబుట్టినాను గరుణించినన్ను బ్రోవవె ఘన మనీష నన ఘ। సర్వశక్తి।

84. హిందూస్థాని భైరవి—రూపకతాళం

(మంగళంగ మదనభంగ మానసుసంగ) అనేమట్టు.

శ్రీవేణుగానలోల శ్రీహరిదేవ। శ్రీ।

నీవేనా దైవమనినిరతము సేవింతు ననీవిటునన్నేడనాడనీకున్యాయమ॥ శ్రీ

భవదీయానుగ్రహపాత్రుడ నేనోయవతారపురుషనన్నాదరింపవె॥ శ్రీ

సాధుజనావనశీల సాక్షాత్కరింప వె శ్రీధరనన్ రక్షింపగ జేపట్టగదె॥ శ్రీ

సేతురామదాసుడనే శ్రీరమానాథసితారకనామమంత్రము నిరతము జపింతు। శ్రీ।

85. జుజావంతి—జుల్వాతాళము.

(గంధమలదు మాకాంతిరుక్మిణిశ్రీ) అనేమట్టు.

నీరజాక్షయో నీరేజనాభ। నీ।

సారెసారెకునో సరసహృదయ నాభారమునీదే యనిపలుమారు మొక్కితి॥ నీ॥

భక్తబాంధవ పాపవిదూర యానక్తిమీరనీసత్పాదసేవనా శక్తి కొలదిజేయు శరణార్థినయ్య॥ నీ।

పరమాత్మ ష్ట పావననామ నిరుపమ తేజనీవాడను నే గరమనురక్తిగావవెభూతేశ। నీ॥

భూతలమునవవి నీతుపబుట్టితి సేతురాముడ శ్రీయుఃపతినన్ ఖ్యాతి మీరగబ్రీతిబ్రోవగదె॥ నీరజాక్ష।

86. ధీరశంకరాభరణము-ఏకతాళము-చతురశ్రగతి.

(హారతివ్వరెమీరు సారసాక్షులంతగూడి) అనేమట్టు.

చేరజీర నెల్లవుడన్ శ్రీకృష్ణమహాప్రభో। చే।

నేరమేమినాయెడ నీరజాసనాదివంద్య భారముగదోచితిన పద్మనాభ నీకునేను॥ చే॥

వాసవాదిసన్నుత నీసమానదైవమేరు భాసమానస్వరూప భక్తునను బ్రోవవె। చే।

నీపైభక్తి నెందరో నిశ్చయకృతార్థులైరినా పాపకర్మమేమొ నాబ్రతు కిట్టులాయె ॥ చే ॥

సేతురామదాసుడ నీసేవాపరుండపరపరుడ ఖ్యాతిగనాదరించి కడ తేర్పవె దేవ ॥ చేర ॥

87. అఠాణా — రూపకతాళము.

(గంధములదరమ్మ మనవండినందనునకుమేన) అనేమట్టు

నందనందనగోవింద నాయందునీదయరాదుగదె॥ నం॥

సుందరాంగ సతతమునీకు వందనంబుజేయుదునే॥ నం ॥

నీలమేఘవర్ణ నిన్నే చాలగసేవించుచుంటినేల నాపైదయ రాదేయే మికనాకు గర్తవ్యము॥ నం॥

బుధజనసన్నుతచరిత విధిగానినెనమ్మియుంటి నధముభక్తుగానైననన్నాదరింపుమా పద్మాంధవ॥ నం॥

శ్రీరమేశ శ్రీహరినే సేతురామదాసుడనె మారారిపూజిత నీ మరుగుజొచ్చితి రక్షింపవె॥ నంద॥

88. పూర్ణచంద్రిక — రూపకతాళము,

(అమృతపానము కృష్ణునివిమలగానము. )

సృష్టిస్థితిలయకర్త శ్రీకృష్ణ కరదధామ ॥ సృ॥

అష్టకష్టములగృశించితి నార్తజనావనబిరుదవె। సృ॥

పట్టినపట్టునదలకనీ పాదభజనమొపుడుజేయుదు గట్టిగ నిన్నేనమ్మితి గరుణాత్మకాపాడవె ॥ సృ ॥

అభవానీదయయే నాకాధారముశ్రీనాథ యూథరాజవరద నన్నేతీరు నరక్షించెదో॥ సృ॥

దీనజనావన దీక్షదీనుడ సేతురామదాసుడనే ననవరతంబు నిన్నే నిశ్చయముగ సేవించెద॥ సృ॥

89. అభోగి—ఖండగతి—ఏకతాళము.

(అంగజమదహర తవజయ మంగళం) అనేమట్టు.

శ్రీకృష్ణస్వామి నాచిక్కుదీరగను ॥ శ్రీ ॥

నీకృపఁగోరితినిగమాంతసంచార నాకోర్కెలుదీర్చి నన్నుంగాపాడఁగదవె ॥ శ్రీ ॥

కామితార్థార్థినై నీపదకమలసేవ వేమరుచేయుచుంటినామీఁదదయ రాదె యేమనివిన్నవింతు శ్యామసుందరాంగ॥ శ్రీ॥

గోపికాసతీమణులు నీపై బ్రేమన్ని ప్రాపుగాంచిరిగదె నాపైనెనరు లేదె యేపగిదిఁబ్రార్థింతునె యెంతనివిన్నవింతునె॥ శ్రీ ॥

సేతురామదాసుఁడ నిచేతఁజిక్కితినె నీతారకనామమునే స్మరియించుచును భూతాత్మసతతము బాగడుచుందు రక్షింపవె। శ్రీకృ॥

90. ఆనందభైరవి — రూపకతాళము.

(పాహిశ్రీగిరిరాజసుతేకరుణాకలితపాదసరోజమునుసరామి తే) అనేమట్టు.

రక్షణమొసఁగోరితి శ్రీకృష్ణ। శ్రితజనావన రాజిత చిద్విలాసానుభవ మూర్తి ॥ ర ॥

అక్షీణకరుణాకటాక్ష వీక్షణమేనినుఁగోరితి ననుపమమహిమాన్విత సదానందమూర్తి ॥ ర ॥

నీపద కమలయుగళము నా నిండుమనమున నిలిపియు భజన జేయుచుంటినే నధికభక్తియుతుఁడనుగా నోపరమపావనమూర్తియో పరమానందభావ రావేలసేతు రామదాసుఁడనె ననుబ్రోవఁగదె। రక్షణ॥

91. ఫరజు — ఆదితాళము.

(పాహిపాహిజగన్మోహనకృష్ణ) అనేమట్టు.

పాపవిమోచను ననుజేయఁగదె పరమపావనశ్రీకృష్ణ॥ పాప॥
నీపాటిదైవమునేగానను గా నోపరంధామ శ్రీకృష్ణ॥ పాప॥
ఎన్నోపాపములేను జేసితి నన్నియుక్షమియింపవె శ్రీకృష్ణ॥ పాప॥
నిన్నెనమ్మితి నన్నుఁగబ్రోవవె సన్నుతచరితశ్రీకృష్ణ॥ పాప॥
ఓమహాత్మ సేతురామదాసుఁడనె నామనవిఁగైకొనుముశ్రీకృష్ణ॥ పా

92. మాయామాళవగౌళ — ఆదితాళము.

(గంధముపుయ్యరుగ పన్నీరు) అనేమట్టు.

గోపాలబాలకృష్ణ మహానుభావ॥ గో॥

శ్రీపతిదయానిధే శేపుమాపనకను నీపావన నామము నేనెప్పుడు స్మరియింతు॥ గో॥

పెక్కుమారులునిన్ను నో సత్యాప్రియయెక్కువనీ పాదవేలమునేభజియింతు చిక్కులుదీర్చ చేపట్టగదె దేవ ॥ గో॥

భవహర భాగ్యదాత పాండవపక్షపాత యవతారపురుష నీ యాశ్రయమెంగోరినాడ భవదీయసేవ కైంకర్యపరుడను గావవె॥ గో॥

రక్షితసురానికర రాధామనోహర శిక్షితాసురకాండ సేతురామదాసుని రక్షింపగోరెద నీరజదళాయతాక్ష॥ గోపాల॥

93. తోడి — ఆదితాళము.

(కలకాలముమాందొడ్లో కాకరకాయలుతిన్నచిలుక) అనేమట్టు.

రక్షింపుమానన్ను కృష్ణ రాక్షసహర॥ ర॥

పక్షీంద్రవాహన పాండుతనయావన॥ ర॥

మనసిజకోటిసుందర మహానీయగుణాగణ కనకాంబరశోభిత కారుణ్యపారావార ॥ ర ॥

భజనపరాధముడ నేనుభక్తబాంధవ నిజభక్తమందార నీవేగతిగావంగనన్ను ॥ ర ॥

శ్రీచంద్రవంశోద్ధారక సేతురామావన నాచేతనేమిగాదు నాథావనుభావవె ॥ రక్షింపు॥

94. నవరసకన్నడ — రూపకతాళము.

(నినువిన నామదెందు నిలువదెహరిహరి) అనేమట్టు.

నీవేనాదైవమని నెరనమ్మియుంటిగదవె॥ నీ॥

కావగనాకొరులెవరుంగతి లేరుగదెకృష్ణ॥ నీ॥

నీ చరితం బనుదినము నేబఠించెద నాచేతనేది యగుననా ధన్నకటాక్షింపవె॥ నీ॥

పరమభక్తినీ కైంకర్యపరుడనైతిని సరభసగతి నన్గావవె సరసమతినిశ్రీగోవింద॥ నీ॥

సేతురామదాసుడనీ సేవాపరుడ నా తాపత్రయముదీర్చి నన్నురక్షింపగదవె ॥ నీవేనాదైవ ॥

95. యదుకులకాంభోజి — ఏకతాళము.

(రామయ్య నామము సులభమురా) అనేమట్టు.

వదలనుగా నీపాదసేవనే॥ వ॥

వదలనీపాదసేవ వనజదళాయతాక్ష నిదురబోవను నేను నీవున్నుదయ జూచువరకు॥ వ॥

నిన్ను నమ్మితి నా పాలిదైవమని నావని కృష్ణ యనుమానమేమి యార్తజనావన దినదినము నీదు సేవ వినయముతో జేయుచుందు॥ వ॥

తరుగదు యేమాత్రము నాభక్తి కృష్ణ మురిపెముననీనామ స్మరణ సొల్లపుడు మరపులేక జేయు మనుజుడనై యుంటి॥ వ॥

జరుపుదు నీభజన కైంకర్యము నే కృష్ణ యరమరలేకను నేననఘ నీ కీర్తనపఠనము జరుపుదు సేతురాముడ జాలమేలరక్షింపవె॥ వదల॥

96. కమాను — ఆదితాళము.

(ఎందుకు నిర్దయ యెవరున్నారురామ) అనేమట్టు

మందరగిరిధర మహనీయకృష్ణ॥ మం॥

సుందరదేవనాయకుండు నీకయరావె॥ మం॥

పరమపావనపాతకవిరామహారపూజితపాద మాశ్రితుడరక్షింపవె॥ మం॥

నీపాదసేవకుండ నోపరంధామ యేపగిది ననుబ్రోచెదో పరమేశ నినునమ్మినాడ॥ మం॥

సేతురామదాసుడ జిక్కులంబడితి నేరీతినను గాపాడెదవో భూతదయాపర॥ మందర॥

97. బేగడ — ఖండగతి — ఏకతాళము.

(జయమంగళం జగన్నాథ) అనేమట్టు.

నినుగొల్చెద త్రిజగన్నుతకృష్ణ॥ ని॥

సనకాదిసన్నుత పాదపద్మ॥ ని॥

నిత్యానందమూర్తి నిర్మలస్వభావ సత్యాసతీప్రియ సర్వాంతర్యామివి॥ ని

భవదీయదివ్యపాద భక్తిపరుడన్న న్నెవరు రక్షింతురె యీవె నన్గావవలె॥ ని॥

శ్రితపాలనభావ సేతురామదాసుడ హితమతి వెలయ నన్నేలు కొన
వె దేవ॥ నిను॥

98. శ్రీరాగం—త్రిశ్రగతి—ఏకతాళము.

(దయాభరణ భయాహరణ దయాశీలబ్రోవుము) అనేమట్టు.

అమోఘమగు మహామహిమ మమరార్చితనీదెగ॥ అ॥

రమాపతి నినామస్మరణము నేజేయుదు నమితంబగునా పాపము క్షమియించినఁబ్రోవవే॥ అ॥

సతతమునీపాదసేవ స్వామినేజేయుదు నావెతలన్నియుదీర్పఁగ నీవె గదగతిదేవ నాకితరులెవరు లేరుదిక్కు హితమతి నన్నాపాడవె। అ॥

కరుణాత్మనీభజనకైంకర్యపరుడనేనుబరమదీక్షనేను నీపదకమలంబు లక్కుమొక్కెద నరవిందాసన వంద్యయనుగ్రహించి యార్తిదీర్పవె॥ అ

క్షితిమర్త్యనేబుట్టితి సేతురామదాసుడనే నతిదీనత్వమున నిన్నాశ్రయించుచున్నాడనె మతిహీనునైనననిని మహాప్రభూరక్షింపవె ॥అ॥

కల్యాణి—త్రిశ్రగతి—ఏకతాళము

99(రామాగుణధామ రఘువంశజలధిసోమశ్రీరామానామనవినువమా)
అనేమట్టు.

స్వామికృష్ణస్వామి యోపరమానందస్వామినామీఁదనీదయరాదేమి॥ స్వా

ఏమిసేయుదు నాకెవరు దిక్కు జనార్దన పామరుండ బాపినినాపాలి దైవమాకృష్ణ ॥స్వా॥

కాలయాపనంబేల జేసెదవదయానిధి పూలపూజ జేసిమ్రొక్కెద భుల్లసరోజాతుబ్రోవవె ॥స్వా॥

సదయహృదయ నన్నుదయతజూడంగనేలనె సదమల గుణనీవునన్ సంరక్షింపవేమ్రొక్కెద ॥స్వా॥

సేతురాముడనీయాతతభక్తుండ దాసుడ జేతోమోదంబుతోడ జేతు
లెత్తి మ్రొక్కెదనీకు ॥స్వామికృష్ణస్వామి॥

100 బేహాగ్—ఆదితాళము.

(సభామంటపము జేరెను) అనేమట్టు

గోపాలచూడామణి ॥గో॥

గోవర్ధనోద్ధరగోపీమనోహరశ్రీ ॥గో॥

వాసవనుత పాదవాసుదేవ కృష్ణ నీసాటి దైవమేరు నిగమాంత వేద్యశ్రీ ॥ గో ॥

అనాథ రక్షకయాశ్రిత కల్పవల్లి సనకాది మునినుత సాక్షాత్కారిం కవెశ్రీ ॥ గో ॥

ఓమహాత్మ సేతురామ దాసునా కామితార్థమిచ్చి కరుణింపుగోవిం దశ్రీ ॥గోపాలచూడామణిశ్రీ॥

## మంగళహారతులు

101. సావేరి — ఆదితాళము

(మంగళంబనరె చెలులుస్వామికి) అనేమట్టు

మంగళంబనుచునునే బాడెద రాధామనోహరనీకు ॥ మం॥

రంగద్వివిధప్రసూన శోభితముగు బంగరుపళ్లెర నివ్వాళులతో॥ మం॥

కృష్ణనీపదభక్తి నెందరొకృతార్థులైరని సేవింటిని విష్ణుహంశాసంభూ తగోవిశ్వంభర నీరాజనమిదుగొ॥ మం॥

నీసేవానిత్యకైంకర్యము నేనేమరకనుజేయుదునె భాసమానమహి మాన్వితనన్నరిభవించక పాలింపగదె॥ మం॥

ఆర్తజనావన నీనామసంకీర్తనంబున్నే నిరతమునాయార్తిదీర బాడు సేతురామదాసాశ్రితుడన్నను రక్షింపగదె॥ మంగళం॥

102. నాటకురంజి — రూపకతాళము.

(మంగళం సమపాంగము హితరంగనాథతె) అనేమట్టు.

శ్రీధరాచిదచిద్విలాస చిన్మయాకృతి మంగళమిదె॥ శ్రీ॥

సాధుజనావన నిరతమాధవ ధరణీధరధర సాధితరిపొ॥ శ్రీ॥

పరమపురుష పద్మనాభ పావనమూర్తి శ్రీకృష్ణ కురుకూరులబరిమా ర్పగ ధరధర్మము నిరవధిగాస్థిరమాయెగ॥ శ్రీ॥

కలుషదూర కంజదళాక్ష కాపురుష నృశంస పలువిధముల బ్రోవు తించెద సలలితమతి దిలకింపవె చలమేలె॥ శ్రీ॥

సేతురామదాసుడనె జేతోమోదము చెలగ జేతులెత్తియిచ్చెదహారతి భూతదయా ఖ్యాతి జేకొను బ్రీతిమెరయ॥ శ్రీ॥

103. కల్యాణి — త్రిశ్రగతి — ఏకతాళము.

(మంగళముసపాడరె సారంగనయనలార) అనేమట్టు.

హారతిగై కొనగదెమహానుభావ కృష్ణమారకోటిసుందర సుకుమార శరీరధీర। హా।

ఫుల్లసరోజాతనేత్ర పల్లవాధరవిచిత్ర సల్లలితసుగాత్రయయిన సాత్రాజితిగూడి మల్లెపూలపాన్పుపైనజల్లనిగాలి మెల్లనవీవనుల్లమలర శయనించు నల్లనయ్యసికిదెజయు॥ హా॥

కేపుమాపువెంటనంటి గోపగోపికాగణంబు తాపసశరణ్యనీవె దైవమంచుబల్క స్త్రీపురుషులునీనామము స్థిరమతితోస్మరియించిన పాపములుదొలంగి కైవల్యపదవిపొందుదురంటివిజయు॥ హా ॥

భూతిదయాపరనన్ బరిభూతిదవ్యఘుగా జేయగ సేతురామదాసుడ నీసేవజేసిమ్రొక్కెదన్ జేతస్ఫూర్తిం గృతార్థుజేసి నన్నుగాపాడవె ప్రీతిమీరనిచ్చితినా చేతులెత్తియిదుగోమంగళ॥ హారతి॥

104. మారువ — ఆదితాళము.

(రంగనాథు పట్టంపురాణి నీరాజనమిదెకొమ్ము) అనేమట్టు.

రక్షితపాండుతనూజ మహాత్మ నీరాజనమిదె గైకొనుమకృష్ణ ॥ ర॥

శిక్షితదుర్జన సంఘాయక్షీణ దయాసాంద్రకృష్ణ ॥ ర ॥

నీరదనీరశరీర దేవయో నిగమాంతవేద్య వారిజాక్షిశ్రీసత్యావల్లభ గోకులతిలకకృష్ణ ॥ర॥

సాధుజనావన సద్గుణగణధామ సర్వజ్ఞమూర్తి శ్రీధర లోకనాథ మాధవగోపీనాథాకృష్ణ ॥ర॥

సేతురామావన శ్రీవేణుగోపాల శ్రితరక్షణశీల నీతారక నామ మే నెప్పుడుస్మరియింతుకృష్ణ ॥రక్షిత॥

105 ధన్యాసి — ఆదితాళము

(విజయగోపాల తేమంగళం) అనేమట్టు.

వేణుగోపాల తేమంగళం లోకవిఖ్యాతకీర్తి తేమంగళం ॥వే॥

అణురేణుపరిపూర్ణ యాదిత్యపూజ్యపాద యంభోరుహాక్షశ్రీకృష్ణ ఫణిపతిశాయి ఫాలలోచనవంద్య పరమపురుష తేమంగళం ॥వే॥

నందనందనగోవింద జనార్దన మందహాస సుందరముఖపద్మ [illegible] గోపీసుందరినాథ పరమానంద భావ తేమంగళం । వే।

శ్రీరుక్మిణీశ సేతురామావన శ్రీగోపీసతీలీల చిద్విలాస మేరుమందర. ధీరాధారుణిభారహార కారుణ్యసాగర తే మంగళం॥ వేణు।

106. షణ్ముఖప్రియ — ఏకతాళము.

(భజేభజే గజేంద్రపాలధన్యమంగళా) అనేమట్టు.

మహాత్మ వేణుగోపబాల మహితమంగళం॥ మ।

సహస్రనామపూజిత ప్రభావమంగళం। మ॥

నమోస్తుకృష్ణ రుక్మిణీశ నాథమంగళం ప్రమోదితామరేంద్రపూజ్య పాదమంగళం॥ మ॥

నీలకుటిలకుంతల ధర నిత్యమంగళం బాలగోపవేష మాంపాహి మంగళం। మ।

భూతదయాపరిపూర్ణ విఖ్యాతమంగళం సేతురామదాసావన శ్రీశ మంగళం॥ మహాత్మ॥

## లాలిపాటలు

107. సురటి — ఏకతాళము.

(రంభాదిసురటివిసర నారదుకు సంభ్రమునవీణమీట) అనేమట్టు.

దీనజనసంరక్షక యదువంశ దివ్య మంగళవిగ్రహ సూనశరుగన్నతండ్రి సుఖముగా సుషుప్తినొందులాలి। దీ॥

రజనికరబింబానన వికసితరాజీవ దళలోచన నిజభక్త ముక్తిదాత సుదర్శన నిర్జితారాతిలాలి। దీ।

దుష్టులనుసంహరించి భూదేవి కష్టమును దెగటార్చియు శిష్టపాలనము జేయ బుట్టినకృష్ణావతారలాలి। దీ॥

గోపాలచూడామణి గోవిందగోవర్ధనోద్ధారక గోపికాగణనాయక శ్రీహరిగోపాలకృష్ణలాలి॥ దీ।

శ్రితరక్షణాంతరంగ శ్రీకృష్ణసేతురాముండు నన్నుహితమతిం గాపా డనిశ సేవింతు బతితపావనుడలాలి। దీనజన।